కీర్తిశేషులైన శ్రీ కందుల శ్రీమన్నారాయణగారిచే స్థాపింపఁబడియె.

సంపుటము. III || నవంబరు. 1913. || సంచిక. 7

# మానవసేవ

నీతి మత సంఘ పరిశ్రమ భాషావిషయములఁ జర్చించు

## సచిత్ర మాసపత్రిక

రాజమహేంద్రవరము

పత్రికాసంపాదకులు

నాళము కృష్ణారావు

సత్యవోలు అప్పారావు.

సత్యవోలు అప్పారావుచే
శ్రీవిద్యానిలయ ముద్రాశాలయందు
ముద్రింపించి ప్రకటింపఁబడియె.
రాజమహేంద్రవరము.

1913.

# విషయములు.



## చిత్రపటములు.



వ్యాసుండు భారతము చెప్పుచుండె,

విఘ్నేశ్వరుండు వ్రాయును.

క. ఇంగలముతోడిసంగతి
బంగారము వన్నె గలుగుభంగి, భవత్సే
వాంగీకృతులయఘంబులు
భంగంబులఁ బొందు, ముక్తి బ్రాపించు హరీ! 278

క. నీపేరు వినిన నోడినఁ
బాపంబులు మాలిపోవు పరమేశ! జగ
ద్దీపక! నీ సేవనమున
నేపారవె భక్తజనుల కిహపరసుఖముల్? 279

క. నీపదయుగ మను నావను
బ్రాపించి భవాబ్ధి వత్సపదముగ ధీరుల్
రూపించి దాటి చేరుదు
రాపత్పదరహితు లగుచు నమృతపదంబున్. 280

ఉ. విశ్వము లీలఁ ద్రిప్పుచు నవిద్యకుఁ జుట్టము వైననీకుఁ దా
శాశ్వత మైనకాల మిది సర్వము వేసబ మందు రట్టివి
శ్వేశ్వర! మేలుకుప్ప! నిను నెవ్వఁడు గోరి భజించు, వాఁడ పో
శాశ్వతలక్ష్మిముక్తిజయసౌఖ్యయుతుం డభయుండు ధాత్రిపై. 281

శా. ఏవేళం గృపఁ జూచు, నెన్నఁడు హరిన్ వీక్షింతు నం చాధ్యుఁ డై
నీవెంటం బడి తొంటిపాపచయమున్ నిర్మూలముం జేయుమన్
నీవాఁ డై తనువాఙ్మనోగతుల ని న్సేవించువిన్నాణి వో
కైవల్యాధిప! ముక్తి నుద్ధవడిఁ దాఁ గైకొన్నవాఁ డీశ్వరా! 282

ఉ. ఎవ్వరు నీపదాంబుజము లెప్పుడు కొల్తురు భక్తినిష్ఠులై,
యెవ్వరు నిన్నుఁ బ్రేమ నుతియింతురు భూరివివేకశాలు రై,
యవ్విమలాత్ము లందుదు రుదంచితశోభననిత్యసౌఖ్యముల్
నివ్వటిలంగ నీశ! నిను నేర్చి భజించిన రిత్త వోవునే? 283

చ. భరితనిదాఘతప్తుఁ డగుపాంథుఁడు శీతలవారిఁ గ్రుంకి దు
ష్కర మగుతాపముం దొరగు కైవడి, సంసరణోగ్రతాపమున్
దొరవునఁ బాయుచుందురు నిన్ను భజించుమహాత్మకుల్, జరా
మరణమనోభయంబులఁ గ్రమంబునఁ బాయుట చెప్ప నేటికిన్? 284

మ. అనఘాత్మా! భవదీయదివ్యపదసేవాసక్తు లైనట్టియ
జ్జనముల్ మృత్యుశిరంబుఁ దన్ని ఘనసంసారాంబుధిన్ దాటి పా
వను లై లోకములుం బునీతములుగాఁ వర్తించుచున్ నిత్యశో
భన మై యొప్పెడిముక్తిఁ బొందుదురు శుంభద్వైభవోపేతు లై. 285

తే. ఈశ! నీపాదమూలంబు లెవ్వఁ డేనిఁ
బొంది ధన్యాత్ముఁ డౌ, నట్టిపుణ్యుఁ డొందు
మనములోపలఁ గోరునే మఱచి యైన?
నవ్యయానంద! యకలంక! హరి! ముకుంద! 286

క. పురుషోత్తమ! నీపదసర
సిరుహధ్యానామృతాభిషేకస్ఫురణం
గర మొప్పువారిచిత్త మి
తరవస్తువులందు వాంఛ దగులునె యెందున్? 287

క. యుక్తిం దలఁప భవద్వ్యతి
రిక్తము లైనట్టియితరదృఢకర్మంబుల్
ముక్తిదము లయిన నీపద
భక్తులు తత్కర్మములను బాటింప రిలన్- 288

చ. నిరతముఁ దావకీనభజనీయపదాబ్జసుగంధలబ్ధి నె
వ్వరిమది వొందఁగాఁ గలుగు, వారలు తత్ప్రియమర్త్యదేహముం
గరము తదీయదారసుతకామసుహృద్గృహబంధువర్గమున్
మఱతురు విశ్వతోముఖ! సమాశ్రితరక్షక! పాపశిక్షకా! 289

చ. సరసవిలోల! సత్పురుషసంగసమంచితభక్తియోగవి
స్ఫురణ ననుగ్రహింపఁబడి శుద్ధము నొందినవానిచిత్తము
స్థిరబహిరంగముం గనదు, చెందదు భూరితమస్స్వరూపసం
సరణగుహం, జిరంబు గనఁ జాలు భవన్మహనీయతత్త్వమున్. 290

ఉ. కేవలకీర్తనీయగతకిల్బిషమంగళతీర్థకీర్తిను
శ్రీవిభవప్రశస్తసుచరిత్రుఁడ వైనభవత్పదాబ్జసే
వావిమలాంతరంగబుధవర్గ మనర్గళభంగి నన్యమున్
భావమునం దలంచునె? కృపాగుణభూషణ! పాపశోషణా! 291

మ. విమలజ్ఞాననిరూఢు లైనజనముల్ వీక్షింప మీపాదకం
జమరందస్ఫుటదివ్యసౌరభము నాస్వాదించి నిర్వాణరూ
పము, సత్పూరుషవాగుదీరితము, శోభాశ్రీనివాసంబు నా
మిము సేవింపక మానవాధముని దుర్మేధాత్ము సేవింతురే? 292

ఉ. పూని భవత్పదాంబురుహమూలనివాసకు లైనవారు మే
ధానిధి! నీవిలోకనముఁ దక్కఁగ నన్య మెఱుంగ నేర్తురే?
మానితపారిజాతకుసుమస్ఫుటసన్మకరందలుబ్ధశో
భానయశాలి యైనమధుపంబు భజించునె యన్యపుష్పముల్? 293

సీ. నీరదాగమమేఘనిర్యత్పయఃశీకరపానచాతకం బేగునే చౌటిపడెకుఁ?
పరిపక్వమాకందఫలరసంబులు గ్రోలుకీరంబు చనునె తుత్తూరములకు?
ఘనరవాకర్ణనోత్కలికమయూరంబు కోరునే కఠినఝిల్లీరవంబు?
కరికుంభపిశితసద్గ్రాసమోదితసింహ మరుగునే శునకమాంసాభిలాషఁ?
తే. బ్రవిమలాకార! భవదీయపాదపద్మ
యుగసమాశ్రయనైపుణోద్యోగచిత్త
మన్యుఁ జేరునె తన కుపాస్యంబు గాఁగ?
భక్తమందార! దుర్భవభయవిదూర! 294

చ. వరమతి నార్తబాంధవ! భవద్ఘనబోధసమేతుఁ డై భవ
చ్చరణముఁ బొందినట్టివిధిసర్గము సుప్తజనుండు బోధమం
దరయఁగఁ జూచురీతిఁ గనునట్టిముముక్షుశరణ్య మైననీ
చరణములం గృతజ్ఞుఁ డగుసజ్జనుఁ డెట్లు దలంప కుండెడున్? 295

మ. చెలి వై, చుట్టము వై, మనస్స్థితుఁడ వై, చిన్మూర్తి వై, యాత్మ వై,
వల వై, కోర్కులపంట వై, విభుఁడ వై వర్తిల్లు నిన్నొల్లకే
వలువెంటం బడి లోక మక్కట! వృథాబద్ధాశ మై పోయెడిన్;
నిలువ న్నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ డానందుఁ డై? 296

సీ. శోకదావాగ్నిశిఖాకులితంబు, పృథుక్లేశఘనదుర్గదుర్గమంబు
దండధరక్రూరకుండలిశ్లిష్టంబు, పాపకర్మవ్యాఘ్రపరివృతంబు,
గురుసుఖదుఃఖకాకోలపూరితగర్త మగుచు ననాశ్రయ మైనయట్టి
సంసారమార్గసంచారు లై మృగతృష్ణికలఁ బోలువిషయసంఘము నహమ్మ

తే. హేతిహేతుక దేహనికేతనములు
నయి, మహాభారవహు లైనయట్టిమూఢ
జనము లేనాఁట మీపదాబ్జములు గానఁ
జాలువారలు? భక్తప్రసన్న! దేవ! 297

చ. మహిఁ దలపోయ నెవ్వనిసమగ్రపరిగ్రహముఁ లభింప ని
స్పృహమతు లై మునీశ్వరులు మృత్యుభయంబునఁ బాతు, రట్టిస
న్మహితవివేకశాలి! గుణమండన! నీ కిల నవ్యసత్పరి
గ్రహ మది యెట్టిచోద్యము? జగత్పరిపాలన! నిత్యఖేలనా! 298

మ. క్రతుదానోగ్రతపస్సమాధిజపసత్కర్మాగ్నిహోత్రాఖిల
వ్రతచర్యాదుల నాచరింప నఖిలవ్యాపారపారాయణ
స్థితి నొప్పారుభవత్పదాబ్జయుగళీసేవాభిపూజాసమ
ర్పితధర్ముం డగువానిభంగి నఘహారీ! దేవచూడామణీ! 299

సీ. దేవ! దుర్జనులకు భావింప హృదయసంగతుఁడ వై యుండియుఁ గానఁబడవు;
కడఁగి నీదివ్యమంగళవిగ్రహంబునఁ జేసి సముచితాశ్రితుల నెల్లఁ
జేకొని సంప్రీతచిత్తులఁగాఁ జేయు దతిశయకారుణ్యమతిఁ దనర్చి
కరుణాత్మ! సర్వలోకప్రజాధిప! భవదనుసరణాభిలాషానులాప

తే. విదితదృఢభక్తియోగప్రవీణు లగుచు
నర్థిమై వీతరాగు లైనట్టియోగి
జనమనఃపంకజాతనిషణ్ణమూర్తి
వని యెఱుంగుదు రయ్య ని న్నాత్మవిదులు. 300

సీ. యజ్ఞేశ! విశ్వంభరాచ్యుత! శ్రవణమంగళనామధేయ! లోకస్వరూప!
యాపన్నభక్తజనార్తివిఖండన! దీనలోకాధార! దివ్యతేజ!
విశ్వోద్భవస్థితివిలయకారణభూత! సంతతానంద! శశ్వద్విలాస!
సర్వలోకాధీశ! సర్వాత్మ! సర్వజ్ఞ! భక్తగృహాంగణపారిజాత!

తే. భూరివిజ్ఞానయుక్తియు, ముక్తిపదము
నిన్నుఁ గొలువనినరులకు నెఱయఁ గలదె?
వినుతమందార! గుణహార! వేదసార!
ప్రణతవత్సల! భద్రాత్మ! పరమపురుష! 301

క. ఎందాఁక నాత్మ దేహము। నొందెడు నందాఁకఁ గర్మయోగము లటపైఁ
జెందవు మాయాయోగ। స్పందితు లై రిత్త జాలిఁ బడ నేమిటికిన్? 126

ఉ. మచ్చిక నీరి కెల్ల బహుమాత్రముఁ జోద్యము, దేహి పుట్టుమం
జచ్చుచు నుండఁ జూచెదరు, చావక మానెడువారిభంగి నీ
చచ్చినవాని కేడ్చెదరు; చావున కొల్లక డాఁగ వచ్చునే?
యొచ్చటఁ బుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్. 127

ఆ. జృంభణమున నరుఁడు దంభార్థమై పశు। వులను జంపి జన్నములను జేయు
వానిఁ బట్టి యమునివారలు గోయుచు। నుందు రెపుడు మిగుల సందడిలుచు. 128

## నిర్వచనోత్తరరామాయణము

క. సిద్ధులగమనంబులకు ని। రుద్ధముగాఁ జనకు మానకోశంబులు స
ద్బుద్ధులకుఁ దగమి యెఱిఁగి జ। గద్ధితమతి సంచరింపు గౌరవ మొప్పన్. 129

చ. ప్రజ ననురాగ మందఁ బరిపాలన సేయున రేశ్వరుండు ద్రో
ర్విజితవిరోధి యై తునిని వేడ్క మెయిన్ విహరించు నెందు నా
ర్యజనులు మెచ్చఁగా సరసి యాదిమునీంద్రనిబద్ధనీతివా
క్యజనితకౌతుకుం డగుచు నమ్మనుజేంద్రుఁడు సమ్మదంబునన్. 130

తే. వలియ చుట్టంబుఁ బక్కంబుఁ బలియ చెలియుఁ
బలియ తల్లియుఁ దండ్రియుఁ బలియ గురుఁడు
వలియ దైవంబుఁ, గావున వలనిపం బొ
నర్చుటయు కాదె ధర్మంబు నాతి కరయ. 131

క. * పెరుఁగుట సగ్గగఁ జవులం। బొరయుట యవళంబుగాఁగఁ బుట్టుట చావన్
బెరయుట పాయఁ బదార్థో। త్కరములనైజ మిది యెట్లు దప్పింప నగున్. 132

* ఈపద్యము భారతములోఁ గూడ నున్నది.

తే. క్షమయ జనుల కాభరణము, క్షమయ కీర్తి,
క్షమయ ధర్మంబు, క్షమయ సజ్జనగుణంబు,
క్షమయ యజ్ఞంబు, క్షమయ మోక్షంబు, క్షమయ
సకలదానంబు, క్షమయందె జగము నిలుచు. 133

క. జనకుఁడు నీతిజ్ఞుం డై। పనిచినఁ బుత్త్రులకు నెన్నిభంగులఁ జేయం
జనుఁ గాక తగవు దప్పిన। విన నేటికి ధర్మమార్గనిరతవిధంబుల్? 134

తే. ఒక్కమన్ననతో నున్న నొల్లకున్నఁ। గరము నెయ్యుఁడై యున్నను గాకయున్న
మగఁడు ప్రియతముఁ డని యుండుమానవతికి। నెల్లలోకసుఖంబులు నెదురు వచ్చు.

క. వడఁబడి యొప్పక యుండినఁ। గడునిర్ధనుఁ డయిన పతియె గతియును విను మె
క్కుడుబంధుండును బ్రియుఁడుం। బడఁతులకుం బరమగురుఁడుఁ బరదేవతయున్.

ఉ. సత్యము లైనజన్నములు నూఱును వేములు సేసినం దప
స్సత్యశమక్షమాదిగుణసంపదతోడ ననేకవాసు లై
నిత్యసమాధియోగమున నిల్చిన నేరికిఁ బొందవచ్చునే
పత్యనుకూల లైనకులపాలిక లందెడుపుణ్యలోకముల్? 137

క. విను మతిథి గృహంబునకుం। జనుదెంచినఁ దనకు దొరకుశక్తిం బూజిం
పనిదుష్కృతి నిజమాంసా। శనుఁ డగుఁ బరలోకమున నసత్సాక్షిగతిన్. 138

క. కాలము సేరిన రోగికి। మే లగునౌషధము లెందు మెయికొనునె మదిన్?
బేల చెడనున్నతఱి వినఁ। బోలునె దగుబుద్ధు లల్పబుద్ధుల కెందున్? 139

క. కాలము సేరినమనుజుఁడు। బాలిశచిత్తంబుతో నపథ్యములఁ గొనం
జాలిఁ బడు గాని తనకున్। మే లగుపథ్యములు గొనఁగ మెయికొనఁ డాత్మన్.

క. అలఘుఁడు దుఃఖముఁ బొందిన। నలఁగక బుద్ధి ధృతిఁ బెంచు నల్పుఁడు దుఃఖం
బలమిన ధృతి సెడి మునుఁగును। జలములలో శిలలు మునుఁగుచాడ్పున నధిపా!

క. శోకముఁ బొందినవానిన్। భీకరరోగములు సెందు బృథులార్థంబుల్
నేకుఱవు వాని కెప్పుడు। శోకము గని విడుచువాఁడు సుజ్ఞాని నృపా! 142

గీ. అగురు మండుచు నుండిన నతిసుగంధ
మొసఁగు నట్టులె సజ్జనుం డసదుమాట
లనువిషాగ్నుల దీపించు, నలఁతి వడఁడు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 84

గీ. చందురుం డున్నతియుఁ బాటు నందు నట్లు
ఘనుల కెప్పుడు సౌఖ్యదుఃఖములు కలుగు
తారకలభాతి విబుధాళి తనరఁ గాదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 85

గీ. చిలువగమి చందనంబును జేరునట్లు
సకలసద్గుణసౌరభాస్వాదనమున
సత్పురుషుఁ గోరి దుష్టులు సనుట నిజము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 86

గీ. కాకి శిఖరంబుపై నెక్క గరుడి యగునె?
పంది దేవాలయముఁ జేర నంది యగునె?
తగనిపదవులఁ గోరుట తగవు కాదు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 87

గీ. పరులసౌఖ్యంబు గోరుచు బ్రతుకువారు
తమసుఖంబులఁ గోరరు ధన్యు లగుట;
కుసుమముల నిచ్చువృక్షంబు గోనునె తావి?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 88

గీ. విమలచిత్తుని, మలినుని సమతతోడ
నాదరించును పండితుం డైనబుధుఁడు
వన్నె తలఁగని యులగంధవహునిభాతి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 89

గీ. పాటుపడి జీవనముఁ జేయ వలయు నండ్రు
పాటుపడువాఁడె భాగ్యంబు బడయు నండ్రు
పాటుపడువానిదేశంబు ప్రబలు నండ్రు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 90

గీ. కుత్తుకలఁ గోయువారలు కుత్సితులును
ధర్మశాస్త్రసంపన్నులు తపసు లైరి
కాల మొకరీతి నుండదు గాదె జగతి?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 91

గీ. జీవనము సౌఖ్యతరముగఁ జేయువారు
చిత్తమాలిన్యమును ముందు చెనకవలయుఁ
జిత్తమును సంస్కరించినఁ జెందు సుఖము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 92

గీ. పరుషవాక్యంబు లెన్నఁడు పలుక కుంట
ధర్మమార్గము నెన్నఁడు తప్పకుంట
మంచి దని చెప్పి రార్యులు మదిని నమ్మి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 93

గీ. పొరుగువారలు దీను లై పొరలు చుండ
వారిబాధల వారింపవలయు సుమ్ము
కలిమి శాశ్వత మని నమ్మి గర్వపడకు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 94

గీ. కటువులును రోగములు నాటి కలఁతఁ జేయు
వాని దొలఁగింప శ్రమపడవలయుఁ గాని
భాగ్యవంతుఁడ నని గర్వపడుట తగదు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 95

# పదునెనిమిదవ ప్రకరణము.

సమరము చాలించిన పైని చందనుఁడు జనార్దనదుర్గసింగులను దనప్రాసాదాంత రమునకుఁ గొనిపోయి మృష్టాన్నంబునఁ బరితుష్టులఁ గావించినయనంతరంబున వారలతో నిట్లు ప్రసంగించెను.

"మిత్రులారా? యీపూటనుండి నేను భుజించునది మీరు పెట్టినయన్నమే సుఁడీ. మీ రొనర్చినమహోపకారమునకుఁ గృతజ్ఞుఁడ నౌటయే కాక యేమి ప్రత్యుప కారము సేయఁగలవాఁడను?''

జనా—ప్రభువరా? మే మొనర్చినది యొక్కయుపకార మనియే లెక్కజేసి తిరా? మీ రాగర్భశ్రీమంతులు. ప్రజాపాలురు. మాబోటినిర్భాగ్యు లనఁగా నెంత? మీ కుపకారము సేయు టెంత? పెఱవారము గావున మే మొనర్చినసాహాయ్యము స్వల్ప మైనను మీ రద్దానిని గొప్పగాఁ బరిగణించుచున్నారు కాని వేఱు గాదు.

చంద—మిత్రమా! సర్వకార్యములఁ జేతోడువాతోడుగాఁ జరించి యనుకూల గతి వర్తించునాగృహలక్ష్మి సౌభాగ్యవతితో నాగృహంబు శోభ తఱలిపోయెను. అట్టి యర్ధాంగితో నాదేహంబు సగంబు చచ్చెను. పరాక్రమమందు దుర్గకు నెన యైన నాతనూజ దుర్గావతి గతింపఁ బుత్రికఁ జచ్చినవాఁడనే యైతిని. మీ రీవిపత్తునందు సాహాయ్యము చేయకుండినచో రాజ్యమును బోవలసినదే. అట్టివిషయములో మీరు చేసి నది మహోపకారము గదా? కావున మీ రన్యు లని నేను భావింపను. మీ రెక్కడకు నేగవద్దు. నాకడ వసింపుడు. సర్వము మీయదే.

జనా—సౌభాగ్యవతి మీ కొనర్చినమహోపకారముముందు మేము చేసినయుప కార మనఁగ నెంత? పూర్వసంబంధమువలన నించుక సాయము మానుండి మీకుఁ గలిగి నది. మీరు పరితుష్టు లైన నంతియె చాలు. మా కేమి కావలెను? ఆత్మగౌరవమే ప్రధాన మని యోజించురసపుత్రవంశము మాయది. కావున మా కొకరియాశ్రయము పొసఁగదు. స్వచ్ఛ మైనరసపుత్రవంశజనిత యైనవీరనారీమణి యాసౌభాగ్యవతి. ఆమె మీ కిల్లా లయ్యుఁ, దనయాత్మగౌరవము నిల్పుకొనఁ జాలక గంగఁ గలసినది. ఆమెయెడ మీరు చూపినకృతజ్ఞత యెవ్వ రెఱుంగనిది?

చంద—ఈనిర్భాగ్యుని క్షమింపుడు. పుష్పావతినుండి మోసపోయితి. అయ్యోడ నాకపటపురుషుఁడు కన్నులఁబడఁగానే త్వరపడి చెడిపోతిని.

జనా—యుక్తాయుక్తవివేచనము లేక యొద్దినిన దన్న దొడ్డిని గట్టింపుఁ డను మహావైభవశ్రియోగాంధులయందు నుండుటకంటె నవివేకము గలదా? లోకవిదిత యైనది సౌభాగ్యవతి. ఆమె పరమసాధ్వి యని మీరే చెప్పియుంటిరి గదా? ఆమెయెడఁ బరపురుషసంపర్కదోష మారోపింప నెట్లు సాహసించితిరి? అయ్యోడ నిజముగా నొకపురుషుఁడే యామెకడ వసించినాఁ డని యందము. స్త్రీపురుషు లొక్కచో వసించినమాత్రన జారిణీజారు లని భావింపవచ్చునా? స్త్రీలు పురుషులతో మాట్లాడరా? పురుషులు స్త్రీలతో మాట్లాడరా? స్త్రీ మాట్లాడుచున్న పురుషుఁడు గురువో, సేవకుఁడో సుతుఁడో, భ్రాతయో, పితయో, బంధుగుఁడో, అతిథియో, యాచకుఁడో నిజము పరిశీలింపక దోష మారోపించుట పాపహేతువు కాక వేఱేమి యున్నది? స్త్రీ పరాక్రమశాలిని యై సమరరంగంబున శత్రువులకు మొగమిచ్చి పోరునప్పుడు బజారి యని దూషించినతులువలు వేనవేలు గలరు. ఒకస్త్రీ రాణి యై ప్రజాపాలనము సేయునప్పుడు పది మందిపురుషులతో సంభాషణము గలిగియుండును గావున నామె వ్యభిచారిణి యని మూఢపురుషులచే నిష్కారణముగ నపనిందను భరించుచున్నది. ఆహా! ఎందఱెందఱు పతివ్రతాశిరోమణులు పురుషులయొక్క యెముక లేనివిషపునాలుకలవలన నాశాభంగము గాంచియుండలేదు? ధర్మ మెఱింగినమీవంటియుత్తమపురుషులే యట్టియవినీతికి లోఁబడ నింక సామాన్యపురుషులఁగూర్చి యనుకొన నేల?

చంద—అయ్యా! మీరు వచించినది యథార్థము. పురుషలోక మిట్లే పాపము నకుఁ బాల్పడి యనుభవంబునఁ బశ్చాత్తాపము నొందుచున్నది. అయ్యది నాకు స్వానుభూతము.

జనా—మాటలవలనఁ గార్యము లేదు. ఇప్పుడు నాకడ నొక్కచిన్నది వసించి యున్నది. ఆమె నాకు శిష్యురాలు. మీకు సంబంధిని. చిరకాలము మిమ్ము నను వర్తించినభార్యయందే మీ కపోహము గలిగినప్పుడు మీ రామెపై నింద మోపకుందు రని యెట్లూహింతును? "తల్లిచెవులు కోసినవానికిఁ బినతల్లిచెవులు పిడికిలిలోని కైన రా" వన్నసామెత వృథ వోవునా? కావున మీ రామెను మన్నింతురా?

చంద — మిత్రమా! సౌభాగ్యవతివిషయమున సయితము నామనస్వాతంత్ర్యము వలనఁ జేసిన దేమియు లేదు. 'స్త్రీబుద్ధిః ప్రళయాంతకః' అనున ట్లయ్యెడఁ బుష్పావతి ప్రేరేపణమే ప్రధాన మయ్యె. కావున శంక వలదు. ఆచిన్నది యెవ్వరో, యెచ్చట నున్నదో యెఱింగింపుఁడు.

జనా — ఇప్పుడు మాత్రము పుష్పావతి ప్రేరేపణ ముండ దని యెట్లు తలంచెదవు?

చంద — సర్వము నా కిప్పుడు బాగుగ ననుభవములోనికి వచ్చినది. నాటనుండి పుష్పావతి యామె ట్లున్నదో చూడక యొంటిపూటయే భుజించి నేలనే శయనించి ప్రాయశ్చిత్తమును బొందితిని. ఇప్పుడు సుఖకర మైన యాత్మబుద్ధికి మీయొక్క గురుబోధనము కూడ తోడైనది. కావున నామన మియ్యెడఁ బరిశుద్ధ మైన దని మున్మాటికిని జెప్పఁగలను. ఇందు సందియము బొందవలదు.

జనా — అట్లైన దుర్గసింగువంకఁ జూడుము. ఈతఁడు పురుషుఁడు గాఁడు. చిత్తూరుముట్టడియందుఁ గోటలో నుండినమీతనూజ దుర్గావతి. ఈమెను విపత్తునుండి యీపురుషవేషముతోఁ దప్పించియుంటిని.

అందుకుఁ జందనుఁ డపరిమితానందభరితుఁ డై వెంటనే దుర్గసింగును గౌఁగిలించుకొని జనార్దనుని గొనియాడి "అయ్యా! మీ రీమెకు గురువు లె ట్లయితిరి? ఈమె కోటిధన మిచ్చియు మీగురుదక్షిణ పూర్తి చేయఁజాలదు." అని వచించెను. జనార్దనసింగు "ప్రభువరా! యింక మీకడ దాపరిక మేల? ఈయూర నున్నదుర్గాలయమున నొకయోగినికడ మీదుర్గావతి సంగీతవిద్య నభ్యసించుట మీ రెఱుంగుదురు గదా? ఆయోగిని నేనే సుఁడీ. కాకులవంటి లోకులయొక్క కానికూతలకుఁ దలఁకి యీప్రచ్ఛన్నవేషమును బూని యాత్మగౌరవమును గాపాడుకొనుచుంటిని. నేను నిర్భాగ్యురాలను గావున దైవము నా కింకను జావు పెట్టలేదు. 'పాపీ చిరాయుః' అనున ట్లింక నెంతకాలము బ్రతికియుందునో తెలియదు. గంగమ్మకు నైన నాయం దనుగ్రహము వచ్చినది గాదు. గంగలోఁ బడినవారు బ్రతుకుట కలదా? నే నెంతపాపాత్మురాలనో గంగ నన్ను భరింపలేక యొడ్డునకుఁ గొట్టివేసెను." అని చెప్పెను. చందనుఁ డామెవృత్తాంతమునకు నద్భుత మొంది "అమ్మా! ప్రాణముపై విసువు జెందినవారు గలరా? అట్టియిల్లాలిని బాపి నై క్రూరాత్ముఁడ నై చేతులారఁ జంపి భరింపరానిదుఃఖ మనుభవించుచున్న నేనే చూచి

చూచి ప్రాణములు విడువలేక యున్నాను. ఆహా! ప్రాణ మెంతతీపియో! నీకు నాకన్న నెక్కుడుపరితాప మేమి గల్గెను?" అని ప్రశ్నింప, నామె "స్వామీ! మీకుఁ బరితాపము నానుండియే కల్గెను. నాతండ్రి యెంతవెట్టివాఁడో దోషావతి యని నాకుఁ బేరు బెట్టుటకు మాఱుగా సౌభాగ్యవతి యని పేరు పెట్టినాఁడు." అని చెప్పెను. అంతటఁ జందనుఁడు "హా! హా! సౌభాగ్యవతీ! సౌభాగ్యవతీ! సౌభాగ్యవతివి నీవేనా? సౌభాగ్యలక్ష్మివి నీవేనా?" యని యొక్కమాఱుగఁ గౌఁగిలించుకొని యొక కన్నునుండి యానందబాష్పములు, నింకొకకన్నునుండి విచారబాష్పములు బొటబొట రాల "దేవీ! నాయపరాధము క్షమింపుము. నావంటిపాపాత్మునిపైఁ గనికర ముంచుము" అని పాదములపై వ్రాలెను. దుర్గావతి "మాతృదేవతా! నమస్కారము. ఇంతకాలమునుండి నే నెఱుంగకుంటిని. ఆతాత మాతాతయేనా? నేను గష్టములు గడచి యీ దినంబున మరల నీకు జనించితిని" అని చంకకు నెగఁబ్రాకెను.

సౌభాగ్యవతి చటాలున లోనకుఁ బోయి వేషమును మార్చుకొని దుర్గావతికి వేషము మార్చి తాను గంగలోనుండి యొడ్డునకుఁ గొట్టుకొనివచ్చి యోగినివేషము దాల్చినది మొదలుకొని యెల్లవృత్తాంతము నాథున కెఱింగించె. వారలయప్పటిసంతోషమునకు మేర యుండునా? ఆసుఖప్రద మైనవార్తలు పట్టణమునఁ గర్ణాకర్ణిని వ్యాపింపఁ బురజను లంతఱుఁ దా మప్పుడు చేయుచున్న వ్యాపారములను దత్క్షణము చాలించి సౌభాగ్యవతీదర్శనంబునకుఁ బోయి యామెను నమస్కరించి కనోజురాజ్యలక్ష్మి యామె వచ్చుటచే నిల్చిన దని కొందఱును, తమదారిద్ర్యము లడుగంటిన వని కొందఱును, పతివ్రతాశిరోమణి కావున గంగలోఁ బడినను మరల బ్రతికిన దని మఱికొందఱును వనుకొనిరి. ఆమెకు యువరాజు జనింపవలె నని బుధవరేణ్యులు కొందఱు దీవింప వారిలో వృద్ధసితాంబుహులు "తథాస్తు" అనిరి. ఆనాఁడు పురవీధుల నుత్సవంబులు చెలరేగెను. సౌభాగ్యవతి మరలఁ దనకు సంప్రాప్త మయ్యె నని యాశ్చర్యము, నింకఁ దనపెత్తనము పోగ దన్న చిన్నతనమును, సౌభాగ్యవతిమోము చూడ సిగ్గును బుష్పావతికిఁ దోప నగరు వదలి కొంతకాలము పుట్టింట నుండఁ బోయెను. కొంతకాలమునకు బుధవరేణ్యులదీవనలు సౌభాగ్యవతికి ఫలించినవి.

# పందొమ్మిదవ ప్రకరణము.



కనోజీయుద్ధమున నపజయము గాంచి ఖానులు మువ్వురును దివాలా తీసినవర్తకులవలెఁ జిన్నపోయినవాజిమోములతో ఢిల్లీకిఁ బోయిరి. అచ్చట నబ్దుల్ ఖానుఁడు తనప్రభువునకును స్నేహితునకును వ్రణచికిత్స చేయించెను. పచ్చిమాంసము భక్షించు కలుకుఁతురకలు కావున గాయములు నాలుగైదుదినములకే మానెను.

అంత నజాపుఖానుఁడు చక్రవర్తిదర్శనము గావించి సీకనోజీయుద్ధమే మయ్యె నని యడుగఁబడి, "మహాప్రభూ! కనోజీయుద్ధమున నోటు రాకపోవలసినదే కాని, నేను నమ్మియున్న బద్మాష్ దుల్ పట్ షా శత్రుపక్ష మవలంబించి నాకు మోసము చేయుటచేఁ జావు దప్పి కన్ను లొట్టపోయిన దన్న ట్లింతటితో బ్రతికియుంటిని. ఈవాఁడు నా కిట్లు చేసినాడు. రేపు మీ కేమి హాని తలంచునో? అతఁడు కృతఘ్నుఁడు. మన విపక్షవర్గమునఁ జేరినవాఁడు. ఆసంగతి యిప్పుడు స్పష్టమైనది. వానికి రాజ్యము నిల్వ రాదు. అతఁడు నాకుఁ బ్రక్కబల్లెమువలె నుండెను. ఆబల్లెమును దామ కటాక్షించి పెల్లగించినఁ గాని నాకు వ్యవహార మెంతమాత్రము సాఁగదు." అని నచ్చఁజెప్పెను. ఖాను చీటికిమాటికిఁ దెచ్చిపెట్టుచున్న పోరాటములకుఁ జక్రవర్తి యనిష్టుఁ డయ్యుఁ దనకు సాయము చేసినమోమోటమువలన నజాపున కేమియుఁ జెప్పలేక విని యూరకుండెను. అట్లూరకొనుట కొంత యంగీకారముగాఁ దలంచి "ఏలినవారి కేశ్రమయుఁ గలుగఁ జేయము. తల యూచినఁ జాలు. మాతంటాలు మేమే పడుదుము. లేనిచో మే మింక హుజూరునౌకరీ చేయఁ జాల" మని చెప్పి ఖాను వీడ్కొన సెలవు దీసికొనుచుండఁగా "జల్దీ కర్కే క్యా కాంబీ నహీ కర్నా" (తామసించి చేయఁ దగ దెట్టికార్యంబు) అని యర్థము గల ఉర్దుభాషలోనిచక్కని సూక్తి చక్రవర్తినోటిలో నాడ, చెప్పుదునా యని యనుకొని, చెప్పఁబోయి హానియనుభవము వానిదే మన కేమి యని యనుకొని వెనుదీసి యెట్టకేలకు "హోసకే సోకసే కుసిబర్ కరస్తా అచ్ఛా" (సాధ్యమైనంతవట్టు సామోపాయము మంచిది) అని బోధించి సెల వొసంగెను.

అజాఫ్ ఖానుఁడు తనయధికార మింక నిరంకుశంబుగా నెల్లకడల సాగఁ గల దని సంతుష్టుఁడై తనయనుచరులతోఁ గళింజరునకుఁ బోయి, దుల్పట్ సాను వంచించి ఘుర్ మండలమును దనస్వాధీనము చేసికొన నిశ్చయించుకొని, యందునకై ప్రయత్నములు సేయుచుండెను. అబ్దుల్ రహిమానుఖానులమనంబులు ఖానునిసంకల్పమునఁ దృప్తిని జెంద "ప్రభూ! ఈతనిగురించి మేము వెనుక నెన్నిసారులు చెప్పినను మీ రుపేక్ష సేయుట వలనఁ గదా యిట్లు చింతింపవలసివచ్చినది? అట్టిబద్మాష్ మనచేతిలోఁ జిక్కియున్నపుడే నొక్కివేసిన నింతముప్పు మనకు వచ్చియుండదు. ఇప్పుడైనను మేల్కొనినారే." యని వచించిరి. అజాఫుఖానుఁడు "కనోజియుద్ధమున మనల నడలగొట్టినజనార్దనసింగును, వానితో నున్నబచ్చాఖయు దుల్పటుసాకు సాయ మొనర్పరారు గదా?" యని యనుచరులతోఁ బల్కి రహిమాన్ ఖానుఁడు "ప్రభూ! కనోజుఘుర్ మండలములతోఁ బ్రజలు మనము జాగ్రత్తగాఁ గాఁచి వారలకుఁ బరస్పరసంబంధములు లేకుండఁ జేయవలె" నని యాలోచనము చెప్పి యాపనిని దానే నెత్తిపైఁ బెట్టుకొనెను.

# ఇరువదియవ ప్రకరణము

దుర్గావతి రాత్రింబవళ్లు నిద్రాహారంబు లెఱుంగక యొరులతో మాట్లాడక, తనలో దాను నవ్వుకొనుచు గడియ కయ్యో యని యేడ్చుచుఁ గటకటపడుచుండుటచే సౌభాగ్యవతీచందనులు గాలి సోకిన దని యనుకొని భూతవైద్యుల నెందఱనో రావించి చికిత్స చేయించుచుండిరి. వందమంది ప్రసిద్ధి చెందినభూతవైద్యు లొకరితరువాత నొకరు చికిత్స చేయుటకుఁ బూనుకొనిరి కాని యయ్యది యెట్టిఘోరపిశాచమో యొకరికిని లెక్క పెట్టలేదు.

ఇట్లుండ, నొక్కనాఁ డాగ్రామమునం దున్నమఠములో బాలసూర్యానందుఁ డనుపేరు గలయొకతపోధనుఁడు వసించియున్నాఁ డని చందనునకుఁ దెలియఁగా వెంటనే యామహానుభావునిసందర్శనము చేయఁబోయెను. అప్పరమముని ముప్పదిసంవత్సరములు పూర్తి కానివయస్సు గలవాఁడు. కడు శాంతభావునివలెఁ గన్పట్టుచున్నాఁడు. తావశము త్రిప్పుట తిన్నగాఁ జేతకాకపోవుటచేఁ గ్రొత్తగా నాశ్రమస్వీకారము చేసియున్నట్లు స్పష్ట మగుచున్నది. చందనుఁడు వానికిఁ బ్రణమిల్లి "స్వామీ! మీసందర్శన మబ్బుటచేఁ బవిత్రుఁడ నైతిని. నేను భవద్దాసుఁడను. తాము నాప్రాసాదాంతరమునకు విచ్చేసి పావన మొనర్పవలె" నని వేఁడికొనెను. ఆతపసి తపశ్శాలుర కుండెడు బింకము చూపుట యెఱుంగక రాజుతోఁ బ్రాసాదాంతరమున కరిగెను.

అతఁ డట్లు ప్రాసాదాంతరమునఁ బ్రవేశింపఁ జందనుఁ డర్ఘ్యపాద్యములు సమర్పించి మృష్టాన్నంబున సంతుష్టిపఱచి ప్రసంగించునెడఁ దనపుత్రికయొక్కదుస్థితి విన్నవించి వాని నామెకడకుఁ గొనిపోయెను. అవ్వెడఁగుతపస్వి దుర్గావతిని జూచి యేమి చేయుటకుఁ దోచనందున మోమునఁ జెమ్మట లంకురింప నిశ్చేష్టుఁడై నిల్చెను గాని విభూతితో బొట్టు పెట్టుట యైన నెఱుంగఁడు. చందనుఁ డతనివైఖరి గాంచి "ఈతఁడు మహానుభావుఁడు. విభూతి యైనఁ బెట్టక లోలోపలనే మంత్రించుచున్నాఁడు. ఇంక నాపుత్రికదురవస్థ తొలంగు" నని భావించుచుండెను. అంతఁ గ్రమ్మిన చెమ్మటలు మొత్తమ్ములచే మోమునఁ బూసికొన్నవిభూతి పూర్తిగఁ జెదరిపోయి బాలసూర్యుఁడే

[illegible]ఁదగినయట్టినిముఖవిలసనము బయల్పడెను. దుర్గావతి యాదివ్యమంగళవిగ్రహమును నబ్బురపాటుతో నొక్కమాఱుగ నఖశిఖపర్యంతము గలయఁ జూచి వలువ సవరించుకొని సుఖాలున రోగము లేనిదానివలె మంచమునుండి క్రిందకు దిగెను. అంత నామెచెక్కులఁ చిఱుచెమట లలుముకొనియె. కోర్కెలు క్రెళ్లు దాఁటె. పెదవుల మందహాసము గ్రిందుకొనియె. ఎక్కడిపిశాచ మక్కడికే తుళ్ళిపోయెను. రాజామహాత్ముని ప్రభావంబున కాశ్చర్యపడి యెంతయో కొనియాడి యపరిమితానందభరితుఁడై తనభార్యను రావించి సమాచార మెఱింగించెను. సౌభాగ్యవతియుఁ బుత్రిక రోగవిముక్త యగుటకు సంతసించి, యామెకు రోగవిముక్తి గలిగించినమహాత్మునివంకఁ జూడ నాతఁడామెకుఁ బరిచితునివలెఁ గనఁబడెను. అంత నామె యెక్కడిపరిచితుఁడో యని బాగుగఁ బరీక్షించి చూచుచుండఁగా సన్యాసికుడిచేతికనిష్ఠాంగుళిని మెఱయుచున్న విలువయిన వజ్రపుటుంగర మామెదృష్టిని బడి నిస్సంశయముగ జ్ఞప్తికిఁ దెచ్చెను. అయ్యెడ నామె వానిస్థితి కేమియుపద్రవము సంభవించునో యని కొంత విచారించి వాని నాసమయంబున బయల్పడఁ జేయఁ గూడ దని యెంచి, పుత్రికాభావ మొక్కసారి యెఱింగిన దగుటచే నామెరోగకారణ మామూలాగ్రంబుగ నప్పుడు మనంబునఁ దెలిసికొనెను. అనంతర మాతపస్వి సౌభాగ్యవతీచందనులచేఁ బ్రార్థితుఁడై కొన్నినాళ్ళు ప్రాసాదాంతరమున వసించెను.

గ్రీకునాయకుఁడు నాతనిభార్యయుఁ దమపిల్లలతోఁ గూడ నాప్రాసాదమునుండి వెడలి యావలకు వచ్చిరి. కాని దురదృష్టవంతురా లగువారినందని కొరోనియా మాత్రము వారినడుమ లేకుండెను. ఆగందరగోళమున వార లామెసంగతియే మఱచిపోయిరి. ఇప్పుడు వారిభవన మగ్నిహోత్రవశము కాఁగా, నామెతల్లి యామెనుగూర్చి యోచింప సాగెను. కొరోనియా మేడముం దున్నవసారయందు గాఢనిద్ర నుండుటచేఁ బ్రస్తుతము జరుగుచున్నసంగతి యామెకుఁ దెలియ దయ్యెను. అయిన, నప్పటిగడబిడవలనను నప్పటియల్లకల్లోలమువలనను నామె కొలఁదినిముషములలోనే నిద్రనుండి మేల్కాంచి, యాసంకులమునకుఁ గారణ మెద్దియో యని గవాక్షమునుండి తొంగి చూచెను. అప్పుడు తమభవనము దహన మగుచుండుటయు, వాని కిరుగుపొరుగుల నున్నప్రాసాదములును గుటీరములును పెంకుటిండ్లును భస్మావశేష మగుటయుఁ గాంచి భీతచేతస్కయై తన్ను రక్షింపవలసిన దని జననీజనకులను బెక్కుమాఱు లుచ్చైస్స్వనమునం బిలిచెను. కాని యామెకొఱకుఁ దనప్రాణమున కపాయముఁ గల్గించికొనుస్వార్థత్యాగి యచ్చట నెవ్వఁడును లేడు. పెద్దపెట్టున నేడ్చునామెతల్లి యొక్కప్రార్థన లెవ్వరిచేతంబులను గరగింపఁజాల కుండెను. కాని యనుకంపాయత్తచిత్తంబున "అయ్యయ్యో! పాప మాతరుణి యెట్లు విలపించుచున్నదో!'' యనువారును, "కటకటా! ఆమెను రక్షించి పుణ్యముఁ గట్టికొనుపుణ్యాత్ముఁడే లే డయ్యెఁగా!'' యనువారును, "మించినఁ గార్యము లేదు. మంట లెగయుచున్నవి. సజీవులై యిచ్చట నిందఱుండియు నామెప్రాణమును గాపాడ నొక్కరైన సాహసింపరు కదా!'' యనువారునే గాని కార్యశూరు లందుఁ గాన్పింపరైరి. ఆమెతండ్రియు నామెను గాపాడ నేయుపాయమును దోపక నిశ్చేష్టితుఁడై చిత్రప్రతిమవలె నిలువంబడియుండెను.

కాని నిరంతరము మానవకోటిపైఁ గారుణ్యసుధను వెదచల్లుచు నాపన్నులఁ బ్రోచు ననాథనాథుఁ డామెదీనాలాపంబుల నాలకించి దిక్కు కల్పించియుండకపోలేదు. మంగళసేనుఁ డాగృహదహనం బగుచోటునుండి ప్రాణరక్షణోపాయంబుఁ గానక భీతార్తయై విలపించునామెవిలాపంబుల నాకర్ణించి, సాధ్యమైనచోఁ దనప్రాణనాశంబైనను నారమణీమణిం గావ నిశ్చయించికొని యిటునటుఁ జూడ దగ్గరనే యొకపొడుగుపాటివెదురుకఱ్ఱ పడియుండుట కానవచ్చెను. అది తీసికొని దానిసాహాయ్యమున నాతఁడావసారలోని కెక్కిపోయెను. అప్పటి కాయువతి యనలోష్ణంబునకుఁ దాళలేక

క్రమక్రమముగఁ దన్ను గౌఁగలించికొనవచ్చునగ్నిజ్వాలలం గాంచి భీతిల్లి మూర్ఛవోయి నిస్పృహురా లై మృతకళేబరముమాడ్కిఁ బడియుండెను. అంతమాత్రమున నామెం జూచి మంగళసేనుఁడు వీతధైర్యుఁడు కాలేదు. ఆకృతికిఁ జైతన్యరహితముగఁ గాన్పించు నాశరీరమును దనవీపుపై వైచికొని, గట్టిగ నొకబట్టతోఁ గట్టి తిరిగి శరవేగంబున దిగి చేష్టలు దక్కియున్నయాశరీరమును గ్రింద భూమిపై దించెను. తోడనే యచ్చట నిలువంబడి యున్నజనసమూహమునుండి "బ్రతికినది. బ్రతికినది. ఇంక భయము లేదు. భయము లేదు. ఆహా! సాహస మన్న నతనిదే సాహసము!" అనువాక్యము లుద్భవించి పెచ్చుపెరుగుచున్నసందడిని మఱింత ప్రోది సేయఁ జొచ్చెను. అగ్రికునాయకుఁడు తనకుమారికను మృత్యుముఖమునుండి గాచినమహోపకారి కాతనిసాహసమునకు నాతని స్వార్థత్యాగమునకును వందనము లాచరింపఁ జూచెను. అతనివదనము కొంతవఱ కగ్ని సంతప్త మైన నొక్కవీక్షణమాత్రమున నాపరమోపకారి మంగళసేనుఁడే కాని యన్యుఁడు కాఁడని యానాయకుఁడు కనిపెట్టఁ జాలెను. కాని యతఁడు గాని యతనిభార్య గాని తమకృతజ్ఞతను జూపకమున్నె మంగళసేనుఁ డంతర్ధానుఁ డయ్యెను. ఆతఁ డెచ్చటికేగెనో యెఱింగినవార లొక్కరును లేరు. ఆమరుసటిదినమున నతనినివాసమును గన్గొనఁ జాలఁగ బ్రయత్నించిరి గాని వారియత్నంబు లన్నియు విఫలంబు లయ్యెను.

# ఏడవ ప్రకరణము

చాణక్యుఁడు తనయుద్దేశమును నెఱవేర్చికొనెను. చంద్రగుప్తుని సింహాసన భ్రష్టునిం గావించుటకు రాక్షసునిచేఁ బన్నఁబడినకుట్రలన్నియు ధ్వంసము లగుటచే నాతఁడు వారలకు వశంవదుఁ డగుట తప్ప వేఱుమార్గము కాన్పింప దయ్యెను. అతనివద్ద దోషము లెన్ని యున్నను మహానందునియన్నముఁ దినియున్నవాఁ డగుటచే నాతనిపై విశ్వాసమును గలిగియుండెను. కాని యిప్పుడు మగధసింహాసనము నెక్కుటకు నాతని వంశీకులు పేరున కైన నొక్కరును లేమింజేసి చంద్రగుప్తుని సింహాసనమునుండి తొలఁగించునభిప్రాయము విడిచిపెట్టెను. కట్టకడకుఁ జాణక్యుఁ డాతనిని చంద్రగుప్తునకు ప్రభుభక్తిపరుఁ డైనట్టియు విశ్వసనీయుఁ డైనట్టియు సచివునిగా మార్పఁ గల్గెను.

రాక్షసుని మంత్రిపదవి కభిషిక్తుం జేసినపిదప చాణక్యుఁడు సర్వసంగపరిత్యాగి యై తా నొనరించినదుష్కృత్యములను మగధరాజకీయవ్యవహారములయందుఁ దాను చేసిన కాపట్యమును దలపోసి తపోవృత్తినిఁ దనగతావశేష మగుకాలమును గడప నూహించెను. కాని తనయభిమతమును చంద్రగుప్తుని కెఱిఁగింపకమున్నె పంజాబునుండి మగధాధినాథునికొలువునందు జీవసిద్ధి యను పేరం బిలువఁబడుతనప్రతినిధినుండి యతని కొకయుత్తరము వచ్చెను. అతఁడు మనమంగళసేనునికన్న మఱెవ్వరును గారు. ఇతఁడు దూరదృష్టి గనిపెట్టుచు రాజనీతినిపుణతతో వ్యవహారములను జక్కపెట్టుచుండుటవలననే పంజాబునృపాలు రెవ్వరును మగధపై దండువిడియ లేకపోయిరి.

మగధాస్థానమునుండి జీవసిద్ధి వెడలిపోయినప్పటినుండియు, నచ్చటిరాజసభాసదులును నుద్యోగియులు నాతనిపోకం గూర్చి పెక్కువిధములఁ జెప్పుకొన సాగిరి. శత్రువుల నణచుటయందుఁ జేసినయనుచితకృత్యముల కసహ్యించుకొని యచ్చటనుండి వెడలిపోయె ననికొందఱును, మగధాస్థాన మంతయుఁ గపటతాన్యాయములకుఁ బుట్టినిల్లైన దనియు నందువలన నయ్యది నివాసానర్హ మైన దనియుఁ దలంచి యాతఁ డచ్చోటుఁ బాసి చనియె నని మఱికొందఱును జెప్పుకొనుచుండిరి.

కాని యీసంగతినిఁగుఱించి చాణక్యునియభిప్రాయము మాత్రము వేఱుగ నుండెను. ఒకనాఁడు వారెల్ల రీవిషయమయి ప్రసంగించుచుండ నొకవార్తాహరుఁడు రహస్యముగ నరుగుదెంచి యాతని కొక్కయుత్తరము నొసంగెను. చాణక్యుఁడు సావధానముగ దానిం జదివి "జీవసిద్ధి నిర్హేతుకముగ నిటనుండి వెడలిపోవునంతటిమూర్ఖుఁడు

క్షా డని నేను వచియింప లేదా? అతఁ డెయ్యదియో మహత్కార్యముకొఱకే మగధను విడిచిపెట్టెను. దానిని నిర్వహింప నతఁడు శక్తివంచన లేకుండ పాటుపడుచున్నాఁడు. ఈయుత్తర మాతనియొద్దనుండియే వచ్చినది.'' అని యిట్లు చదువ దొడంగెను.

ఆర్యా!

హృదయపూర్వకవందనముల నాచరించి వ్రాయుసంగతులు:—

మీకోర్కెలు నెఱవేరుటకు నాచేయఁగల్గినదెల్లఁ జేసినాడను. శత్రువులు మీపై దండెత్తి వచ్చుప్రయత్నములను మానినారు. ఆవిషయమయి మీ రింక నాకులపాటు నొందఁ బని లేదు. నే నాలోచించుచున్నసంగతి యెల్ల మీ కీవఱకే తెలియును. నాయుద్దేశములు ఫలించినంతవఱకు నాకు మనశ్శాంతి యుండ నేరదు. మనసమయము ననుసరించి మీరు మీధర్మమును నిర్వహింప వలసియున్నది. ఇహలోకంబున స్వదేశమునెడఁ దా నొనరింపవలసిన విధాయకకృత్యముకన్నఁ బవిత్రమైనది మఱియొకటి లేదు. ఈవిషయమయి మీరు కలుగఁజేసికొనక తప్పదు. అట్లే యంతయు నేర్పాటు చేయఁబడినది. కార్యసాఫల్య మగునెడల మగధసంస్థానమునకుఁ బ్రసిద్ధియు గౌరవనీయములగుమాకు సుస్థిర మగుప్రఖ్యాతియుఁ జేకూరఁ గలదు. గ్రీషియనులతో పంజాబు సంగ్రామంబునకు దిగఁ గడంగుచున్నది. నే నీసమయంబున నిచ్చట నుండక తీరదు. ఇందువలననే యంతయాకస్మికముగ మగధరాజ్యమును వీడివచ్చుట తటస్థించినది. మీ [illegible]చ్చినప్పుడు నేను మీకుఁ దోడ్పడ సంసిద్ధుఁడనై యున్నాను. నేను మగధ రాజ్యంబున్నప్పుడు మిమ్ము నర్థించినదానిని నెఱవేర్చ మీరు కూడ నయబద్ధులరై యుంటిరి [illegible] ప్తి యుంచుకొనవలసిన దని కోరుచున్నాను. ఇంతకన్న విస్తరించి వ్రాయ నక్కఱ లే దని తలంచుచు నింతటితో విరమించుచున్నాఁడను.

ఇట్లు భవదీయస్నేహితుఁడు

జీవసిద్ధి.

అచ్చట నుండి యీయుత్తరము నాలకించుచున్నవారల కందఱికిఁ గడపటివాక్యముల యర్థము బోధపడినదికాదు. కాని వానియభిప్రాయమును చదువరులు సులభముగ నూహింపవచ్చును.

# ఎనిమిదవప్రకరణము.

---

బుకేఫలపురమును వదలి వెళ్లినప్పుడు మంగళసేనుఁడనారోగ్యస్థితియం దుండెను. తనహృదయమునకు దగ్గర యైనట్టియు, బ్రియ మైనట్టియు నొక్కప్రాణిని సంరక్షించితిని కదా యని యాతఁడు సంతృప్తిఁ బొందియుండెను. కాని యట్లొనరించుటయందుఁ దనకే యపాయమును దెచ్చికొనెను. దాదాపుగ నాతనియొడ లంతయుఁ గాలుటచే నతఁడు కొంతకాలమువఱకు విశ్రాంతిని గోరెను. అగ్రీషియనునాయకునికిఁ గాన్పించిన యెడల నతఁ డతనిని దయతో నాదరించి యుండును గాని యతని నెట్లు నమ్మి యుండఁ గలఁడు? గ్రీషియనులపైఁ జేయఁబడు కుట్రలకు మంగళసేనుఁడే ముఖ్యకారకుఁ డని దేశ మెల్ల వాకొనుచుండ, నతఁ డాపట్టణంబుననే యాగియుండుట పిచ్చితనము కదా.

విశ్వసనీయుఁడును, దనసహచరులలో నొకఁడు నైన రామచరణునితో నాతఁడు జీలమునదియొడ్డున నున్నయొకపల్లెటూరికిఁ బోయెను. అతనికి సహాయు లై యతని సంకల్పమునందుఁ బని చేయుచున్నమిత్రులును, నతనిని బ్రేమించువారలును ననేకు లచ్చటఁ గలరు. ఆతఁడు కొలఁదిదివసంబులవఱకు జ్వరపీడితుఁ డైనను పైఁ జెప్పిన యాతనిమిత్రులపరిచర్యవలనను సాహాయ్యమువలనను కొద్దివారములలోనే యాతఁడు స్వస్థుఁడు కాఁ గలిగెను.

అతఁడు సంపూర్ణారోగ్యవంతుఁ డైనపిదపఁ దమశత్రువులకు గ్రీసుదేశమునుండి సాహాయ్యము వచ్చునెడల వారి నెట్లుషెంచవలసినదియు నిర్ధరించ వారలొకమహాసభను గావించిరి. పంజాబుదేశ మాకాలమున నుత్తము లగురాజపుత్రులతో నిండియుండెను. వారిలో మంగళసేనుని కవిధేయు లైనవారలు లే రనియే చెప్పవచ్చును. తమకు మంగళసేనుఁడు నాయకుఁడుగ నున్నందులకు వారలు గర్వించుచుండిరి. మొట్టమొదట కొలఁదివందలజనులకు నాయకుఁడుగ నుండిన మంగళసేనుఁ డిప్పుడు తనయానతి నతిక్రమించక నడచుకొనున నేకవేలరాజపుత్రుల కధికారి యయ్యెను. ఆసభయం దచ్చటఁ జూచిన నుత్సాహము మూర్తిమంత మై నృత్యము సేయుచున్నట్లు కనుపించెను. దేశాభిమాను లైన యాయోధు లందఱు తమస్వాతంత్ర్యపతాకము నెప్పుడు విస్తరింపఁ జేయు

దుమా యని యుత్సుకులై యుండిరి. వారికన్నులయెదుట మంగళసేనుఁడొకనిజమైన యోధుఁడుగఁ గాన్పించెను. వానియొక్క దేశాభిమానపూరిత మగుప్రతివాక్యమును వారిహృదయములయం దొకనవీనోత్సాహము నుద్భవింపఁ జేయుచుండెను. అతనిధైర్యమును, దుఃఖకర మగువిపత్తునం దైన సంతోషించుస్వభావమును, కృపావిభూషితం బగు విక్రమంబును, నౌదార్యమును గ్రమశిక్షితులు కాకపోయినను వారలను వలసినంతప్రబలసైనికులుగ మార్పఁగలిగియుండె ననుటకు సందియము లేదు. అచ్చట నున్నవారిలో నెవ్వడును దా నొకప్రత్యేకనాయకునిగ నుండెద నని కోరలేదు. మంగళసేనుఁడే తమ కెల్లరకును సర్వాధికారిగ నుండుట కంగీకరించిరి. ఇట్లుండ నాసభయం దొకవితర్కము బయలుదేరెను. ఆసభయందలియువయోధు లెల్లరును విదేశీయాధినివేశముల నాక్రమించి వారలఁ దమయధీనములోనికిఁ దీసికొనవలె నని కోరిరి. కాని మంగళసేనుఁ డట్లొనరింప నిష్టపడలేదు. "గ్రీషియనులకును హైందవులకును జయాపజయనిరూపణ మొనరించు యుద్ధము జరిగినంతదనుక నట్లు చేయుట యుక్తము కాదు. ఈస్వల్పవిషయమై యింతకంతశోష యేల? మగధచక్రవర్తి స్వయముగ శత్రువును రణరంగమునం గలిసికొని యనీక మొనరింపఁ గృతనిశ్చయుఁడై యున్నాడు. అసంఖ్యాకము లగునాతనిసైన్యముల నోటుబుచ్చ శాత్రవులకు దుస్సాధ్యము. పంజాబునందలిదేశాభిమానులును, శౌర్యవంతు లగుప్రజానాయకులును దమతమబలముల నభివృద్ధి సేయఁ బ్రయత్నింపవలయును. రాజసైన్య మేకారణముచే నైన శాత్రవుల నోంచలేనిచో నాప్రజానాయకు లెల్లరుఁ గలసి వారల నెదిరించి, సామర్థ్యమువలనఁ గాని తంత్రమువలనఁ గాని బలమువలనఁ గాని మోసమువలనఁ గాని, వారల నుక్కడంచవలయును. మాగధులును విదేశీయులు నొకరి నొకరెదుర్కొనినంతవఱకుఁ బ్రజానాయకు లూరకుండి యుద్ధముయొక్క పర్యవసానమును నిరీక్షించుచుండవలెను." అని గంభీరభాషణంబుల నాతఁడు నొక్కి వక్కాణించెను. అంత వార లెల్లరు నట్లు చేయుటయే యుత్తమ మనియు, నదియే సరియైనపద్ధతి యనియు నుడివి మంగళసేనునివాక్యముల నామోదించి, యేకగ్రీవముగ వానియుపదేశానుసారముగఁ బ్రవర్తించెద మని వెల్లడించిరి.

# తొమ్మిదవ ప్రకరణము.

మంగళసేనుఁ డానాటిరేయి సాహసకృత్య మొనరించినప్పటినుండియు నా నాయకునిహృదయమునం దొకవింత మార్పు కలిగెను. స్వయముగ నాతఁడు ధైర్యవంతుఁ డగుటచే నెవరియందు ధైర్యము కాన్పించినను వారిని గౌరవించుచుండును. ఇప్పు డతఁడు తనదుహితను మంగళసేనుని కొసంగుట కాతని కేయభ్యంతరమును లేకుండెను. కాని యప్పుడు తనజాతిపైఁ గుట్రలు జరుగుచుండుటవలన నతఁ డనుకొనిన ట్లొసరించ నశక్తుఁ డయ్యెను. అతఁడు మంగళసేనునిసంస్థానము నాతనికిఁ దిరిగి యిచ్చివేయఁ దలంచెను గాని యట్టిసందిగ్ధసమయంబున నాతఁ డేమి చేయఁగలఁడు? ఈవిషయమై యాతఁడు తనభార్యతోఁ బ్రసంగించెను గాని యామె కూడ నేయుపాయమును జెప్ప లేకపోయెను.

తాను మంగళసేనునిచే రక్షింపఁబడితి ననుసంగతి తెలిసినపిదప కొరోనియా యపారసౌఖ్య మనుభవించిన ట్లయ్యెను. హిత మూపదేశించుతలంపుతో మంగళసేనుని వెదుక నామె మనుష్యుల నంపెను కాని యాతఁ డెచ్చటను గాన్పింపఁ డయ్యెను.

# పదియవ ప్రకరణము

పంజాబుదేశ మంతయు నిప్పుడు గ్రీషియను సైన్యములచే నాక్రమింపఁబడినది. సెల్యూకస్ ఒకవైపునను చంద్రగుప్తచక్రవర్తి మఱియొకవైపున నుండిరి. ప్రబలు రగు శత్రువులు హైందవులను సంభ్రమపఱుపఁ బ్రయత్నించిరి గాని విఫలు రైరి. శ్రేష్ఠము లైన సైన్యములం గూర్చుకొని చంద్రగుప్తుఁడు శత్రుసేనల నెదిరింప వచ్చెను. అతఁడే తెంచుటవలనం గాని లేనిచో హైందవులు శాత్రవఖడ్గముల కెఱయై యుందురు. ఈవఱకు జరిగినయుద్ధములలో నాచక్రవర్తి తనసైన్యముయొక్క పంక్తులనడుమనుండి పోవుచు రణవిశేషములం గనిపెట్టి నశ్వారూఢుఁడై పోరాడుచుండువాఁడు. కాని యీతరి సైనికులు తన్నుఁ జూచి ధైర్యోత్సాహములతో నని యొనరింప విగతవాహనుఁడై పోరాడి వారితోఁ బాటు కష్టదుఃఖముల ననుభవింప నిశ్చయించుకొనెను. అతనికాలమున నుండుయోధులలో నెల్ల నతఁడే యగ్రేసరుఁడు. సమర మన్న నాతని కుత్సాహము మెండు. ఉభయసైన్యములు జీలముప్రాంతమున నెచ్చటనో యొక్కెడఁ గలిసికొనెను. సమర మారంభించినమూఁడవదినమున గ్రీషియనులు పరిక్లాంతులై పలాయితులు కాసాగిరి. కాని విదేశీయులసాహాయ్యమును బొందినట్టియు వారియధికారముక్రింద నున్నట్టియు హిందూరాజులు దేశద్రోహులై మగధసైన్యములనుండి విడివడి రెండవపక్షమునం జేరి గ్రీకులతోడఁ గలసి రాజసైన్యము నెదిరించి పెక్కురను కథావశేషులం గావించిరి. దాదాపు వారము పదిదినములవఱకు యుద్ధ మతిభయంకరముగ జరిగెను. అప్పటిరీతి ననుసరించి యేపక్షమువారికిని జయాపజయనిరూపణ మొనరించ సాధ్యము కాకుండెను. మంగళసేనుఁడు కాని యాతనియనుచరులు గాని యుద్ధమునందు జోక్యము కలుగఁజేసికొనక భయంకరముగ రణ మొనరించునాయిరు తెగలవారినిం జూచుచు సమయమునకు వేచియుండిరి. కాని యెన్నినాళ్లకును యుద్ధ మొక్కవిధమున నే తేఁగుచుండుటచే జయాపజయములలో నెయ్యదియో యొకటి నిశ్చయము సేయుఁ దలంచి పదునొకండవదివసంబున మంగళసేనుఁడు తనసహచరసమూహములం బిలిచి, యింక వేచి యుండక శత్రువులను మార్కొనవలె నని చెప్పెను. అట్లే యామరునాడు గ్రీషియనులును హైందవులు నతితీవ్రంబుగ బోరాడుచుండ దక్షిణదిశనుండి మంగళసేనుఁడును,

పశ్చిమమువనుండి యిరువురుదండనాయకులును వచ్చి భీకరంబు లగువృకంబులంబలె శత్రువులం జుట్టుముట్టిరి. అంతట శత్రుసైన్యములు వరుసలు తప్పెను. వానియందు సంభ్రమ సంక్షోభములు ప్రబలెను. కోలాహల మతిశయించెను. వైరులయం దనేకులు వధియింపఁబడిరి. తొందరతో సైనికులు తమప్రాణములం గాపాడుకొన నుత్తరాభిముఖులై పరువు లెత్తసాగిరి. సైన్యసమూహమునం దొకభాగము వితస్తానదిం దుమికి వైరివీరులబారినుండి తప్పించుకొనుచుండెను. గ్రీషియనుసేనాధిపతులు చెదరిపోవుచున్న తమసైన్యవిభాగములం బురికొల్పి యువ్వెత్తుగ నొక్కఁనడి శత్రువుల నెదుర్కొఁని వారలం బరిమార్పఁ జూచిరి గాని యట్లొనరింప వారి కసాధ్య మయ్యెను. పారిపోవ మిగిలినగ్రీషియనుసైనికులు హైందవులధాటి కాఁగలేక యీవలను రంగస్థలమును విడిచి పోయినతమమిత్రులనుండి పలాయనపాఠమును నేర్చుకొనిరి. తుట్టతుద కరివర్గంబులు విశేషనష్టమును బొంది, సంపూర్తిగఁ బరాజితులై మగధేశ్వరునిశరణముఁ జొచ్చిరి.

## పదునొకండవ ప్రకరణము.

యుద్ధము పరిసమాప్తమయినతరువాత గొప్పవిద్వాంసుఁడైన మెగాస్తనీస్ అనుగ్రీషియనురాజదూత చంద్రగుప్తునిసభాభవనమున కరుదెంచెను. అతఁడు విశేష సామర్థ్యము గలరాజకార్యకుశలుఁడు. అతఁ డద్భుతము లైనయనేకపుస్తకములను రచించి గొప్పగ్రంథకర్త యని విఖ్యాతిం గాంచెను. స్వదేశములో ఏథెన్సుపట్టణమున తోడిదేశీయులు తన్ను దురాదరణకుఁ బాలు సేసి తన కనేకోపకారము లొనరించుటవలన నాతఁడు స్వదేశమును గడపటిపర్యాయము విడిచిపెట్టి సెల్యూకస్ దేశాంతరములపై దాడి వెడలుచుండ నతనిని వెంబడించి పోయెను. అందువలన నాతఁడు హిందూదేశముపై వచ్చినప్పుడు కూడ మెగాస్తనీసు అతనితోడ నుండెను.

పంజాబునందు సంపూర్ణాపజయము నొందినపిదప సెల్యూకసు సంధివ్యాపారముల నడపుటకై మెగాస్థనీసును బంపెను. చంద్రగుప్తాదు లాతనికిఁ బ్రేమపూర్వకముగ స్వాగత మిచ్చి సత్కరించిరి. అప్పుడు దౌత్యకార్యనిపుణుఁ డైనయాతఁ డి ట్లని ప్రకటించెను. "హిందూగ్రీసు దేశములకు రాజకార్యములందలి ప్రమాదమున నీయుద్ధము సంభవించినది. సెల్యూకసు విరుద్ధాభిప్రాయములతో హిందూదేశమునఁ బ్రవేశించలేదు. ఈదేశమునం గృతావాసు లైనగ్రీషియనులవాక్కులను గాపాడి పరిరక్షింప నాతఁ డిటకు వచ్చెను. గ్రీసునకును మగధకును సమర మెందువలనం బొసంగినదో యెవ్వరికిని దెలియుట లేదు. ఈరహస్యమును గ్రమక్రమముగా కాలమే వెల్లడించవలెను." ఈయుపోద్ఘాత మైనసిమ్మట నాతఁడు వినయపూర్వకముగ సంధికొఱకుఁ బ్రార్థించెను. హిందూదేశమున గ్రీషియనులపై ద్వేషభావము లెవ్వియు లే వనియు, సెల్యూకసుతోడ మైత్రి నెరపి యిరువురుభూమీశులకును స్నేహబంధమును బలపఱచవలె ననియే యున్న దనియు, నందుకొఱకు చంద్రగుప్తుని రాజ్యాదృష్టములఁ బాలుఁగొనరోజ్ఞానారాజకుమారిక నాతని కొసంగుట యుచిత మనియు, మున్ముం దిప్పటివలెఁ బ్రమాదము లెవ్వియు సంభవింపకుండ చూచుటకై మగధసభయం దొకగ్రీషియనుదూత నుంచవలె ననియు చాణక్యుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఈషరతులయందు బాధకము లైన వెవ్వియు లేనందున గ్రీషియనురాజు వాని నంగీకరించెను. కొలఁదిమాసములలోనే రాజకుమారిక నిచ్చి చంద్రగుప్తునకుఁ బరిణయము జరుపఁబడుటయే గాక గ్రీకులకుఁ బ్రతినిధిగ నుండుటకును, వారలు దేశీయులను హింసింపకుండ కాపు చేయుటకును హైందవాస్థానమున మెగాస్థనీసే నియమింపఁబడెను.

# పండ్రెండవ ప్రకరణము.

ఈకథయందలిసమాచారముల ననుసరించి విచారించినవారల కీరాజకార్యప్రమాద మునకు మంగళసేనుఁడే కారకుఁ డని తెలిసికొనుట కష్టము కాదు. హిందూదేశమున నున్నగ్రీషియనులపైఁ గుట్రలు సలిపి వారి నచ్చటినుండి వెడలఁగొట్టఁ దలంచి విపరీతాభిమతములతో దేశముపై దండెత్తివచ్చుచున్నగ్రీషియనుసైనికులపైఁ దనకు సాహాయ్య మొనరించు మని కోరుటకై మంగళసేనుఁడు మగధసంస్థానమున కరిగెను. అంతియ గాక, గ్రీషియనులు దాడి వెడలియే వచ్చినయెడల, సీవటిలో ననేక కారణములచేఁ దనయభిమత మీడేర్చుకొన వీలు లేకపోయెను గాని లేనిచో నాయలెగ్జాండరువలెనే సెల్యూకను కూడ మగధరాజ్యమును ధ్వంస మొనరించి దానినిఁ దనరాజ్యమునకుఁ గలుపుకొనఁ గోరు ననియు నందువలన మగధరాజ్యమునకుఁ గూడ నపాయము వచ్చిన రాచ్చుననియు, మంగళసేనుఁడు చాణక్యునకుఁ దెల్పెను. విదేశీయులకును హిందువులకును వివాహసంబంధములు కల వని బుకేఫలపురగ్రీకునాయకునికిఁ జూపవచ్చు నని యూహించి మగధాధీశునకు రోజ్గానా నిచ్చి వివాహము చేయ నగుఁగవలసిన దని మంగళసేనుఁడు చాణక్యునిఁ బ్రోత్సాహపఱచెను. కడ కతఁ డభిలషించిన ట్లెల్ల జరిగెను.

దేశమునందు శాంతి నిలిచినయనంతరమున సీవటిలో గ్రీకులచే నన్యాయముగ నాక్రమించుకొనఁబడినసంస్థానము లాయాయధీశుల కొప్పగింపఁబడినవి. పూర్వపుకక్షలును బూర్వపువిరోధములు నెల్లరు మఱచిపోయిరి. చాణక్యుఁడు జీవసిద్ధివిషయమై మెగాస్థనీసునకుఁ దెలియఁజేసెను. తోడనే యాతఁ డాచంద్రగుప్తునియాస్థానమునం దున్నవారిలో నెల్ల జీవసిద్ధి వివేకవంతుఁ డనియు, శక్తిమంతు డనియు కోరోనియా నాతని కిచ్చి పాణిగ్రహణ మొనరించవలసిన దనియు గ్రీకునాయకు నడుగ బుకేఫలపురమున కరిగెను. ఆగ్రీషియనునాయకుఁ డాతనిగౌరవాభిప్రాయమునకు సంతసించి మంగళసేనునికే తనకొమార్తె నీయ నిశ్చయించితి ననియు, నతఁడే యామెకుఁ దగినవాఁ డనియు సముచితగౌరవంబున నాతని కెఱింగించెను. ఆనాయకుఁ డట్లు చెప్పుటకిశేని

మొగాస్థనీసు హృదయంబున సంతసించి జీవసిద్ధి మంగళసేను లొక్కరే యనియు, నవి రెండు నొక్కని నామములే యనియు నాతనికిఁ దెల్పెను. వెంటనే యానాయకుఁ డాసంగతినిఁ దనవారల కెఱింగించెను. పిదప నాతనికుటుంబమునం దుండువా రెల్లరు నపారసమ్మోదమును బొందిరి. కొలఁది కాలమునకె యొండొరులం బ్రేమించి యున్న * కరుణామంగళసేను లిరువురును బవిత్రమయిన వివాహబంధమునఁ గలుపం బడిరి.

సంపూర్ణము.

* ఈకథ ఉర్దూగ్రంథమునుండి పరివర్తింపఁబడినయొకయాంగ్లేయగ్రంథమునుండి యనువదింపఁబడినది. ఇందలి 'గోజ్గానా' యనునామెకు 'రోహిణీ' యనియు, 'కారోనియా' యనునామెకు 'కరుణ' యనియు మేము నామము లిడితిమి.

# స్వర్గీయ దాంపత్యము

కష్టన్నిసియా యొకధనికునికూఁతురు. ఆమెజనకుఁ డొకప్పుడు కడు బీద యై యుండె. కాని తనసూక్ష్మబుద్ధివలనను, నిరంతరపరిశ్రమవలనను నాతఁ డమితముగ ధనము నార్జింపఁ గలిగెను. కష్టపడి సంపాదించినధన మగుటచే, నాతఁడు లోకరూపాయను మొహరీవలె నెన్నుచు నొక్కచిల్లిగవ్వ వ్యయము చేయవలసివచ్చినను మిక్కిలి కష్టపడుచుండును. ఏల నన తాను సముపార్జించిన రూపాయలు, అణాలు, పైస లన్నియును దనశరీరమునందలిరక్తబిందువుల ప్రతిరూపము లని యాతఁడు తలంచుచుండును. తాను కోటీశ్వరుఁ డయ్యును దనస్థితిమాత్రము మాఱలేదు. దారిద్ర్యమునే యనుభవించుచుఁ గృపణస్వభావుఁ డై యుండుటచేఁ గాబోలు, జను లందఱు నాతనిపేరు నసహ్యముగా నుచ్చరించుచుందురు. మనదేశమునందు లోభియొక్కనామము ప్రాతఃకాలమున స్మరించుటకైన యోగ్యమైనదికాదుగద! ఇట్టిపరమలోభిగృహమున కష్టన్నిసియా జన్మించినది.

కష్టన్నిసియా రూపమునం దసమాన యై, సుగుణగణములకుఁ బుట్టినిల్లై, స్త్రీజనాలంకారభూత యై యొప్పుచుండెను. చూచుట కామె గులాబిపుష్పమువలె లావణ్యవతి యై యెట్లు కన్పట్టుచుండెనో, యట్లులె యామెను సమీపించువా రామెసుగుణసంపద యనుసుగంధపరిమళముచే వ్యామోహితు లగుచుండిరి. ఆమెశరీరచ్ఛాయ యేవిధముగ స్వర్ణమును ధిక్కరించుచుండెనో, యావిధముగనె యామెహృదయనైర్మల్యమును రజతధావళ్యము నధఃక్షేపించుచుండెను.

ఇట్టికుసుమకోమలగాత్రియు సుచారిత్రియు, పుణ్యశీలయు నైన కన్సన్సియా పత్రశూన్య మగు వృక్షోపరిభాగమున నుండెడి స్వర్గచ్యుత మగు దేవమందారమువలె, స్వార్థపరుఁడును, దయాశూన్యుఁడును, రసహీనుఁడును, విషయాసక్తుఁడు నగుపరమలోభియింట నివసించుచుండెను.

ఈసుకుమారి వసించెడిగ్రామమునకుఁ జేరువ నున్నయొకపల్లెయందు థియోడోసియసు అనుపేరు గలయొకబుద్ధిమంతుఁడును భక్తుఁడు నగుయువజనుఁ డుండెను. కన్సన్సియా పదునైదువత్సరములప్రాయము నందినప్పటినుండియు నామెకును నీయువునకును విశేషపరిచితి కలదు. థియోడోసియసు తఱచుగా కన్సన్సియాగృహమునకు వచ్చుచుఁ బోవుచుండుటయుఁ, గలసినప్పు డెల్ల మిక్కిలిచనవుతో సంభాషించుచుండుటయుఁ గలదు. వారిరువురకు మైత్రి హెచ్చినకొలఁది నొండొరులు తమకష్టసుఖముల వెల్లడించుకొనుటవలనను, వా రేకముఁగ నుండుట తటస్థించినపు డెల్ల సద్గ్రంథపఠనము సల్పుటవలనను, సత్సంభాషణమునందే మెలఁగుచుండుటవలనను వారికిఁ బరస్పరానురాగ మతిశయించెను. నిష్కాపట్యమున నొండొరులు కొలఁదికాలమైన మెలంగుటచే వారిలోఁ బ్రేమ ప్రజ్వలించును గదా! అట్టిప్రేమ యనెడిసులలితమైన పుష్పహారముచే బంధింపఁబడిన థియోడోసియసు కన్సన్సియా లను స్రోతస్వతులగు రెంటినదు లొక్కటిగఁ గూడి యనంతప్రేమసాగరమునఁ జేరుటకై ప్రవహించుచుండి నట్లుండె. ఇట్లు మధురసమ్మేళనమువలన వారిలోని భేదభావములు సన్నగిలినకొలఁదిని, ఏకమనస్కులై, ఏకాభిప్రాయులై, ఏకాదర్శాభిముఖులై తమజీవితయాత్రను నడపుచు, గష్టమునను సుఖమునను, సంతోషమునను దుఃఖమునను, సంపత్తునందును విపత్తునందును, ఆరోగ్యావస్థయందును, రోగావస్థయందును నొకరిలాభనష్టముల నిరువురిదిగా నెంచి వారు భావమునందును, జ్ఞానమునందును, ప్రేమయందును,

సేవయందును సమానోన్నతిని నీశ్వరునియందుఁ బడయునిమిత్తమై పవిత్ర వివాహబంధముచేఁ గట్టుబడుట కియ్యకొనిరి. కార్యక్రమమున వారిరువురును దమపవిత్రోద్దేశమును దమమాతాపితరుల కెఱింగించిరి. కాని థియోడోసియసుయొక్కతండ్రికిని కన్స్టన్సియాయొక్కతండ్రికిని దమలోఁ దా మొకరికంటె మఱియొకరు జాత్యోన్నత్యమునందును, ధనసమృద్ధియందును నధికుల మని గర్వమునుండుటచేఁ గాఁబోలు, వారిసంబంధమునకు నొప్పుకొనరైరి.

నీచస్వభావుఁడగు కన్స్టన్సియాయొక్కతండ్రి యేవిధముననైనను దనకుమార్తెను థియోడోసియసు వివాహమాడకుండునట్టుల విఘ్నము లొనరించి, అందుచే థియోడోసియసుయొక్కజనకునిగర్వ మడంపవలయు ననెడిదురుద్దేశముతోఁ దనకొమారితకొఱకు ధనవంతుఁడగుమఱియొక యౌవనునికై ప్రయత్నించుచుండెను. కన్స్టన్సియా యన్ననో, స్వర్ణమునకు తావి యబ్బినట్టుల, తనరూపసౌష్ఠవమునకును, ధనసంపత్తికిని గూడ మేలిమి నొసంగుసుగుణసంపదలచే నొప్పుయువతి యగుటచే, నామెను వివాహమాడుట కనేకధనాఢ్యులపుత్రు లియ్యకొనిరి. ఆపెతండ్రియు వారిలో నెక్కువధనవంతుని నొక్కనిఁ దనగారాబుపట్టినిఁ జేపట్టఁ దగినవాఁ డని నిశ్చయించి, తనయభీష్టము నామె కెఱింగింప నామె సిగ్గుచే నేమియు పలుక నొల్లక నధోవదనయై నిలువబడియుండెను. అంతట నామెతండ్రి “మౌనం సమ్మతిలక్షణ” మనువాక్యమును మది నెంచి శీఘ్రముగఁ దాను నిశ్చయించికొనినవరున కిచ్చి పెండ్లి చేయుటకై ప్రయత్నములు జరుపుచుండెను. పెండ్లిసమాచార మెక్కువకాలము దాఁగియుండనేరదు గనుక, గ్రామమం దంతట కన్స్టన్సియావివాహవిషయమై సంభాషణములు జరుగుచుండెను.

ఈవార్త థియోడోసియసునికర్ణపుటములం బడినంతమాత్రమున నాతఁడు నిశ్చేష్టితుఁడై భూమిపై వ్రాలె. ఆతనిహృదయము కంపించుచుండ, నాతనికన్నులనుండి యశ్రుపాత మయ్యె. ఆతనినిరాశ యెట్టి దని యెవరు వర్ణింపఁగలరు? తనజీవితమునం దనన్యసహచారిణి యై తనతో ప్రేమసూత్రముచే బంధింపఁబడిన నారీలలామ మఱియొక్కని కాత్మవిక్రయము చేసిన దని వినుటకంటె థియోడోసియసునిశిరమున వజ్రఘాతమై యుండినను బాగే! అట్టికర్ణకఠోర మగునావార్త విని థియోడోసియసు మిక్కిలి చింతాకులచిత్తుఁడై కన్స్టన్సియాపేర నీక్రింది రీతిని నొకలేఖను బంపె:—

"ప్రేయసీ, కన్స్టన్సియా,

నీవు మఱియొకని వివాహమాడుదు వని వింటి. ఈసమాచారము హాలాహలమువలె నాహృదయమును దహించివేయుచున్నది. నేను మనస్స్థిమితము లేనివాఁడనై పిచ్చిపట్టినవానివలె నున్నాఁడ. మనచిరస్నేహమును, సఖ్యమును జలబుద్బుదప్రాయ మైనవా యేమి? నీయకృత్రిమప్రణయసూచకము లగులేఖల నెంతయో పూనికతో నాయొద్దఁ జేర్చికొని యింతకాల మానందించుచుంటి; వాని నిప్పు డెచట నుంచుదు? నీవేమి చేసినను సరే, నిన్ను మాత్రము నేను నాహృదయమందిరమునుండి తొలఁగింపఁజాలను; నీవు చిరకాల మీహృదయమున స్వర్గవాసిని యగు దేవీరూపమునఁ బూజింపఁబడుదువు. సాంసారికసంబంధమును, శారీరకసంబంధమును విలుప్త మగుఁ గాక! అధ్యాత్మికసంబంధము మాత్రము చిరకాల ముండఁ గలదు. నీవు అన్యాశ్రయ వైనపుడు నే నేవిధముగ, నెట్టి యాశతో సంసారమున నుండఁ గలను? ఎవరిమోమువంక నిరీక్షించుచు సంసారమును నడపుదు? నాయొక్కసంసారము శూన్య మైనది. నేను నీవద్దనుండి యావజ్జన్మాంతము సెలవు గైకొని పోవుచున్నాను. పరమేశ్వరుఁడు నిన్ను సుఖపెట్టును గాక!"

ఈయుత్తరమును జదువుకొని కస్సన్ద్రియా మూర్ఛిల్లెను. కొంత కాలమునకు తరువాత చైతన్యప్రాప్తయై యామె తనమనస్సులో, “హా! నేను తండ్రిమాటలకు స్పష్టముగా బదులు చెప్పుటకు జంకి యెట్టిదుష్కార్యమును సంఘటించితిని! అప్పుడే నేను మఱియొక్కనిపత్ని నైతి ననియు, థియోడోసియసు నాప్రియతము డగుభర్త యనియు, నేను మఱియొక్కని నేవిధముగ పరిణయము గానేర్తు ననియు చెప్పియుండిన నీయ నర్థము వాటిల్లకుండు గద! నాప్రాణప్రియుండగు థియోడోసియసున కింతటివ్యథను దెచ్చిపెట్టకుందును గద! ఏమైనను సరే, యీరాత్రి గడచి ప్రాతఃకాల మగునంతనే నాతండ్రికి మనస్సు విచ్చి యన్నియును జెప్పెద. అటుతరువాత నామనోనాధున కుత్తరము వ్రాసెద” నని యనుతాపపడ సాగెను.

కాని తెల్లవారునప్పటికే థియోడోసియసునితండ్రిచే బంపఁబడినయొకసేవకుఁడు కస్సన్ద్రియాగృహమును జేరి “రాత్రినుండి థియోడోసియసు కనబడుటలేదు; మీగృహమునకు నచ్చెనా యేమి? లేక యాతఁ డెచట నున్నది మీకుఁ దెలియునా?” యని ప్రశ్నింప కస్సన్ద్రియా “ఆయన యిచ్చటికి రాలే” దని బదులు చెప్పెను. సేవకుఁడు మిగుల విచారగ్రస్తుఁడై యజమానునిగూర్చి నిరాశ జేసికొని వెడలెను. వెంటనే థియోడోసియసునికొఱకు నలువైపులకు వెదకుటకై మనుష్యు లంపఁబడిరి. కాని యాతఁ డెచటికిఁ బోయినదియు, నెవరును దెలిసికొనలేకపోయిరి.

ఇట్లుండ, కస్సన్ద్రియా థియోడోసియసు కనఁబడలే దనెడి ఘోరవార్తను విని, యేకాంతముగ నేడువసాగెను. తనయపరాధముచేఁ దనప్రాణప్రియుఁడు దేశాంతరగతుఁడు గావలసివచ్చెఁ గదా యని విలపించుచు, నతనిచే వ్రాయఁబడిన లేఖను మరల నొకసారి జదువుకొని, దాని భావమును గ్రహించి, యొకవేళ నాతఁడు ఆత్మహత్య జేసికొని యుండ

నోపు నని తలంచెను. ఆపదసమయములందు మనప్రేమాస్పదులను గూర్చి మన కెంత దుఃఖావహ మగునూహ యైనను హృదయగోచర మగుచుండుట సహజము. కావున థియోడోసియసు తనవియోగమునకు గుంది యాత్మహత్య చేసికొనె నని నిర్ధారణ చేసికొని యామె తండ్రితో "నామనోహరుడు కాన్పింపకపోవుటచే నే విధవ నైతిని. నే నిక నెవరిని వివాహ మాడ నొల్ల. న న్నీవిషయమై నిర్బంధపెట్టకు డని మీపాదములు బట్టికొని ప్రార్థించుదాన. నేను నాజీవితకాల మంతయు నవివాహితనై యుండి బ్రహ్మచర్యమును సల్పెద" నని కన్నీరు మున్నీరు గాగ నేడ్చుచు విన్నవించెను. ఆహా! దాంపత్యప్రేమ యన నిట్టిదియే గదా! వివాహతంతువు జరుపబడినంతమాత్రమున దనమనోనాథుని, ప్రాణసమానుని గోల్పోయినయువతి యేవిధముగ మఱియొకని చెట్ట బట్టును! అవిచ్ఛేద మగువివాహబంధ మొకహిందువులకు మాత్రమే స్వాతిశయమును గలిగించునది గాక, నాగరికత కాటపట్టయి, సభ్యులగు మానవజాతులతో నిండినసమస్తదేశవాసులయొక్కయు హృదయాంత రాళముల నానందభరితము లగునటుల జేయునది స్వర్గీయప్రేమయే గదా!

అయినను నోటినుండి స్పష్టమగుమాటల నైన నాడలేనంతటిపసి తనమునందే పసికూనలను వివాహతంతువునకు లోబఱచి, కాలకర్మ మున నాచిఱుతప్రాయులకు వైధవ్యప్రాప్త మగునెడ వారి నాజన్మాంతము నిర్బంధవైధవ్య మనుభవింప శాసించు మనహిందూమహాజనులదాంపత్య ధర్మమునకును, అవ్యాజప్రేమపాశముచే గట్టువడినవధూవరులలో దైవి కముగ ప్రాప్తించు భర్తృవియోగమునకై విలపించునారీరత్నములవైరా గోద్దీపిత మగునాత్మసమర్పణమునకును సాటియా?

స్టన్సియాయొక్క తండ్రి ధనమునందు గలమమకారము కోమ
రితయందును లేనివాడగుటచే పెండ్లిప్రయత్నము విఫలమైనను వివాహ
మునకై తనబొక్కసమున మఱికొన్నిరూప్యములు కర్చుగాక మిగిలినం
దున కాతఁ డెంతయు సంతృప్తుఁ డయ్యెను. కావున నాతఁడు తనకోమరిత
యొక్క ప్రార్థన నంగీకరించుటచే నూతనవరునకుఁ గల్గిననిరాశ నడఁచు
నుద్దేశముతోఁ గొంతధనము నిచ్చి వానిని బంపివేసెను.

కన్స్టన్సియా యంతటినుండియు నీశ్వరధ్యానపరాయణయై విశేష
కాలము ప్రార్థన, భజన, శ్రవణ, మననాది భక్తికైంకర్యముల మెలఁ
గుచుండె. ఆమెయొక్క కుటుంబము రోమన్ కాథలిక్కు క్రైస్తవసంప్ర
దాయమునకుఁ జెందినదగుటచేతను, రోమన్ కాథలిక్కులు మనహిందు
వులవలెనే, జపతపోపవాసవ్రతతీర్థయాత్రాద్యనుష్ఠానములచే నీశ్వరుని
బొందుటకు సాధనములుగ నవలంబించువారగుటచేతను, కన్స్టన్సియా
యును హిందూవితంతువులవలె నుపవాసములం గడపుచు, వ్రతముల
నవలంబించుచు, రుచ్యములగునాహారములను పానీయములను వర్జిం
చుచు, మెత్తనిపరుపులపై శయనించుట మాని, సకలవిధములగునామోద
ప్రమోదములనుండి విరతయై కాలము గడపుచుండెను. క్రమముగా
నామెకు నీశ్వరునియందు భక్తి యినుమడించెను; కాని యొక్కమనోవేదన
నుండి మాత్ర మామె యెంతమాత్రమును పరిత్రాణము బడయలేక
పోయెను. ఈమశ్చింతయే దూదిలోనినిప్పువలె నామెహృదయమును
దహించివేయుచుండెను. పాపము చేసితి ననెడిజ్ఞానము మనహృదయ
ములలో నంకురించినపుడీకన్స్టన్సియావలె దావానలజ్వాలల పాల్పడనివా
రెవ్వరుందురు? తనదుర్బలత్వముచేఁ దనప్రాణసముఁ డగు థియోడోసి
యసునియాత్మహత్యకు కారకురాలైతినిగదా యని యామె యెల్లపుడు
గుందుచుండు. ఈపాపబాధ యామెకు వృశ్చికదంశమునకంటె నెక్కువ
బాధను గలుగఁజేసిన దన నతిశయోక్తి కానేరదు.

## స్వర్గీయ దాంపత్యము.

ఈవిధముగ పదిసంవత్సరములు గడచినవి. ఇప్పుడు కస్టెన్సియా కిరువదియైదుసంవత్సరములప్రాయ మగుటచే, నామెయొక్క శరీరసరోవరముపై వయస్సుయొక్క గాంభీర్యకిరణములు ప్రసరింప, నామె కోటిసూర్యప్రభాభాసమానయై ప్రకాశించుచుండె. ఆపవిత్రమూర్తిని చూచినంతమాత్రమున దుశ్చింతలు తొలఁగుచుండె. ఆత్మ భక్తిరసమును గ్రోలుచు నానందపరవశ మగుచుండె. ఇఁక ధర్మమార్గమును వీడి ప్రాణమును భరింపఁజాల మనెడియూహాలు పొడముచుండె. ఆహా! భక్తియొక్క ప్రభావము నెవరు వర్ణింపఁగలరు? ఆభక్తియే పవిత్రమైన యాచరణమునకుఁ దోడ్పడిన, అగ్నికి వాయువు తోడ్పడినటుల మానవహృదయాంతరాళముల నపవిత్రము గావించెడిపాపపుటూహాలను భస్మీపటలముగఁ జేయఁగల్గును గద! ఆమె యేలకో సాంసారికసుఖముల ననుభవించుటకై యుద్దేశింపఁబడినమానవియుఁ గాక, స్వర్గీయసుఖములం దేలియాలలాడుటకై యుద్దేశింపఁబడిన దేవీస్వరూపిణియుఁ గాక, కేవలము నైమిషారణ్యాచారిణులగు శాంతిస్వరూపిణులైన ఋషికన్యలబోలియుండె. మఱియు, నింద్రియదమనము, వైరాగ్యము, విశ్వాసము, ప్రేమయు, ఘనీభవించి కస్టెన్సియారూపమును దాల్చెనో యన నొప్పుచుండె.

ఆమె యీవిధముగ సాధనభజనలందు కాలము గడప గడప, నామె నొక్కయుచ్ఛతరాదర్శ మావహించెను. ఆమెకు ముఖ్యముగా నీశ్వరునియెడ భక్తిశ్రద్ధలను జూపి, యుపాసనాపూర్వకముగ నాతనిసంయోగప్రాప్తి వడయుటకును, జనసమాజముయొక్క సేవార్థమై తనజీవితమును గడపుటకును, మఱియు ధర్మప్రచారమునకు సయితము దోడంగుటకును ముఖ్యసంకల్పమై యుండె. రోమన్ క్యాథలిక్ సమాజమున నెవరు బ్రహ్మచర్యవ్రతమును బూని యీశ్వరప్రీతికరముగ నాత్మసమర్పణము చేయుదురో, అట్టివారు స్త్రీ లయినచో 'నన్' లనియు పురుషు లయినచో 'మాంకు' లనియు వ్యవహరింపఁబడుదురు.

వారు నిర్జనస్థానములలోఁ గట్టఁబడిన మఠములలో నివసించుచు నీశ్వరుని సర్వదా తమహృదయములం దిడుకొని మానవసేవ యొనరించుటకై సర్వ విధముల సాధనములఁ జేయుచు, రోగులసేవ చేయుటయందును, మత ప్రచారమునందును గాలము గడపుదురు. ఈవిధముగ కన్ట్సన్సియాయును నేదో యొకమఠమునఁ జేరి సన్యాసినీవ్రతమును పరిపాలింపవలయు ననెడికోర్కెతో తండ్రియనుమతికై వేఁడెను. తండ్రి తక్షణమే తన కొమరితప్రార్థన నంగీకరించెను. తనకొమార్తె తపస్విని యయినచోఁ దన వ్యయము కొంత తగ్గవచ్చు నని యాతఁడు తలఁచి య ట్లొనరించి యుండవచ్చు. లోభికి ధనముకంటె ప్రియతమ మైనవస్తు వేది గలదు?

నిర్దిష్టదినమున తండ్రి కన్ట్సన్సియాను వెంటఁబెట్టుకొని యొక మఠ మును జేరి యామఠాధికారిణివశమునఁ దనముద్దులపట్టిని నొప్పగించి తాను గృహాభిముఖుఁ డయ్యెను. ఎవ రైనను సన్యాసవ్రతమును బూన నియ్యు కొనుటకుఁ బూర్వమే మఠాధిపతిసమ్ముఖమునఁ దమపూర్వజీవితచారిత్రము గూర్చి చెప్పుకొని తమపాపములకై క్షమాపణము వేఁడుచు నీశ్వరప్రార్థన మొనరించుట రోమన్ క్యాథలిక్సాంప్రదాయమున నొకనియమ మై యుండెను. ఆనియమము ననుసరించి కన్ట్సన్సియా యామఠమునందలి ప్రధానాచార్యుఁ డగు ఫ్రాన్సిసునకుఁ దనజీవితమునుగూర్చి చెప్పవలసి నటుల నాజ్ఞాపిత యయ్యెను. ఆమెపొడవైన నల్లనివెండ్రుకలు కత్తి రింపఁబడి, యామెకు సన్యాసినులు ధరించుపరిధాన మొసంగఁబడియె. అంతట నిర్దిష్టసమయమున, నొకనిర్జనస్థానమున నుండెడిప్రాంగణమున కామె జేరి, యచ్చట నుంచఁబడిన మేరీమాతయొక్కయు, శిలువపై హతుఁడైన క్రీస్తుయొక్కయు పటముల కెదురుగా నుండిన యున్నతాసన మును సమీపించెను. ఈపవిత్రగృహమునకు నామె వచ్చినవెంటనే ప్రధానాచార్యుఁడగు ఫ్రాన్సిసు ఉన్నతాసనము నధిష్ఠింప నాయనముం దర కన్ట్సన్సియా తనపూర్వజీవనచారిత్ర మంతయుఁ జెప్పవలసియుండెను.

ఆచార్యుఁ డగు ఫ్రాన్సిసు దీర్ఘకాయుఁడును, సౌమ్యమూర్తియు నయి యుండెను. ఆతఁడు ముండితమస్తకుఁడై విశేషపరిచ్ఛదావిశిష్టుఁడై యుండెను. ఆతనిప్రకృతి యతిగాంభీర్యమై యొప్పు. ఆతనిప్రీతిచూడ్కి యందును సరళభావమును, ధర్మానురక్తియును ప్రస్ఫుటిత మగునటుల దోఁచుచుండెను. కన్నన్నియా గురుదేవునిచరణపద్మములకు వినయభక్తి పూర్వకముగ మ్రొక్కి నతవదనయై యీక్రిందివిధముగ స్వీయచరిత్ర వర్ణనమునకు ప్రారంభించె:—

"నేను బాల్యకాలమునందు గురుతరమగు నే యన్యాయకృత్యము నొనరించినటుల నాకు జ్ఞప్తి లేదు. నాసమవయస్కు లగుబాలురును బాలికలును దుండగమున నా కపకారములు జరిపినపుడు సయితము నేను వారికి ప్రత్యపకారము చేయక యే యుండుదాన. అందఱును నన్ను ప్రేమించుచుండెడివారు. నాతండ్రి కృపణుఁడును, ధర్మమునం దవిశ్వాసియు నై యుండెను. అయినను నే నాయనను సంతానోచితశ్రద్ధాభక్తులతో ప్రేమించుచు, నొక్కయాజ్ఞను తప్ప మిగిలిన వన్నియు శిరసావహించితి."

నని చెప్పి కొంచె మూరకయుండి యత్యంతవిషణ్ణవదన యై కొంత సేపటికి మరల తనవృత్తాంతమును ప్రారంభించె. "యౌవనదశ ప్రాప్తించిన తోడనే నే నొక తీవ్రమగు పాపకృత్యమున కొడిగట్టికొంటి. నాకొఱకై నిరపరాధియు, నిర్దోషియు, సరళస్వభావియు, దేవసమానుఁడు నగునొక యౌవనుఁ డాత్మహత్య చేసికొనెను. ఆతనిప్రాణవినాశమునకు నీహతభాగ్యయే కారణము." అని చెప్పి, నాయొకన్నులనుండి నీరు బొటబొట కారఁ జొచ్చెను.

అంతట నాచార్యు డగు ఫ్రాన్సిసు "అమ్మాయి! 'ఏడ్వకుము? సుస్థిరమతివై, శాంతభావములో నీవృత్తాంత మంతయు జెప్పుము; నేను సావధానచిత్తముతో వినుచున్నాఁడ" ననెను.

కన్నన్నిసియూ మరలఁ దనవిషయమై చెప్పఁదొడంగి "నేను పృథ్వియందు నొక్కని ప్రేమించితి. ఆతనికి నాప్రాణమును, మనమును, నా దగుసర్వస్వము నర్పించితి. ఇప్పటికిని నాతఁడు నాభర్తరూపమున, నా హృదయరంజకుఁ డగు దేవతారూపమున నాప్రాణమందిరమున విరాజిల్లుచున్నాఁడు. ఆశ లన్నియు నాశము జేసికొంటి; సుఖములఁ ద్యజించితి; సకలవిధములగు భోగముల బరిత్యాగము చేసితి; కాని యాదేవమూర్తిని మాత్రి మిహృదయమునుండి వెడలింపలేనైతి. మే మిరువురమును నేకహృదయులము, నేకమనస్కులము నైతిమి. మేము వివాహసూత్రముచే నాబద్ధు లగుటకు నొప్పుకొంటిమి. ఇట్టిసమయమున నాతండ్రి నన్ను మఱియొకని కిచ్చి వివాహము చేయునట్లు లాలోచించుచుండుటను తెలిసికొనియు, నేను నాదుర్బలత్వముచేతను, లజ్జచేతను, తండ్రిమాటలకు బ్రిధమమున మాటాడ నైతి. ఆకారణమున నేను మఱియొకనిని వివాహము చేసికొందు నని యాయన తలఁచెను. ఈవార్త గ్రామమునందంతట నల్లికొన నాప్రియతముఁ డగు థియోడోసియసు నా కొకలేఖను వ్రాసి, తా నెచటికో జీవితమును విసర్జింపఁ జనె. ఓదేవా! నావలన నాతఁడు తనజీవితము నకాలమృత్యువునకు సమర్పించె. ఈపాపమున కేమి ప్రాయశ్చిత్తము గలదు?" అని కన్నన్నిసియా రోదనము చేసెను. ఆమె పూర్వస్మృతి జాగరితమై కన్నుల నీరు గారె, నామె పవిత్ర[illegible] సిక్తము లయ్యె. ఆచార్యుఁ డగు ఫ్రాన్సిసును క్రింద[illegible] భింప నాయిరువురక్రిందనధ్వనులతో నాయేకాంత[illegible] మయ్యెను.

"హా! పాపమా! నేను నీ కెంత దాస్యమును సల్పితి! నాపాపచారిత్రమును వినిన ఫ్రాన్సిసు కూడ నాదుఃఖముచే దుఃఖితుఁడై యింత క్రిందనము చేయుచుండె" నని యామె తలఁచెను. ఫ్రాన్సిసు క్షణకాలములో శాంతభావము నవలంబించి "చింతిలవలదు. గతివిషయముగూర్చి

మంగళమయుఁడగు పరమేశ్వరునిప్రసాదలాభమున క్రమక్రమముగ ధర్మమార్గమున నీ వగ్రెసర యౌదువు. నీ వేకఠినవ్రతమును గైకొనఁ దలఁచితివో, దానియొక్క గురుతరబాధ్యతను గ్రహించి దానివిషయమై యాలోచింపుము. చిరకాలము కఠోర మగు బ్రహ్మచర్యవ్రతమును పాలింపవలసి యుండును. ప్రాపంచికభోగములును విషయసుఖములును తాపసులకు లక్ష్యములు గావు. వారికి ధర్మాలోచనయు, మానవసేవయు, ధర్మప్రభావమునే ప్రధానకర్తవ్యములు. ఈమార్గమున నడచుట యతి కఠినము. కాని నీవు పరమేశ్వరునిపై భారము నుంచి యాత్మసమర్పణము జేసితి వేని, నీ కన్నియు ననుకూలములే యగును. ఈక్షేత్రమున సంసార సుఖములు లేవు; స్వర్గీయసుఖములు మాత్రమే గలవు. నీ వనేకశోధనల పాల్పడవలసియుండును; కష్టముల సహించవలసియుండును; ప్రలోభనములకు లోఁబడక యధ్యాత్మికపతనములనుండి రక్షించుకొనవలసియుండును; ఆకారణమున నీ వీశ్వరశరణాపన్నవై విశేషభావముతో సిద్ధముగ నుండుము. నీయొక్క నిజమయిన శాంతికొఱకును, సుఖముకొఱకును నీశ్వరుని యాశీర్వాదములకై నేను ప్రార్థించెద" ననెను.

కన్స్టన్సియా భక్తివిగళితహృదయముతో నాచార్యుఁడగు ఫ్రిన్నిస్సునిపాదముల కెఱగి చుంబన మొనరించెను. తరువాత వా రిరువురును మఠమునందలి తమతమస్థానముల కేగిరి. కన్స్టన్సియాను మఠాధికారిణి యొక్క గృహమున నుండుటకు సెల వొసంగఁబడెను. ఫ్రిన్నిసాదినము రాత్రి మఠాధికారిణితో కన్స్టన్సియాఁగూర్చి పెక్కుసంగతులు చెప్పెను. మఱునాఁడు ప్రాతఃకాలమున మఠాధికారిణి ఫ్రిన్నిసుచే కన్స్టన్సియా పేరిట వ్రాయఁబడిన యుత్తర మొకటి తెచ్చి యిచ్చెను. కన్స్టన్సియా యతను నాచార్యునిలేఖను మిక్కిలి శ్రద్ధతోఁ జదువుకొనెను. ఆలేఖ యొక్క సారాంశ మిదియు:—

“నీవలన థియోడోసియసునకు మృత్యువు వాటిల్లిన దని, నీవు నిన్నటిదిన మత్యంతానుతాపమును వెల్లడించితివి. నిజముగా నాతఁడు చని పోలేదు. ఆతఁడు స్వస్థశరీరముతో శాంతిపూర్ణహృదయముతో నిహ లోకమునందే జీవించియున్నాఁడు. నీవు నిన్నటిదిన మెవరిసమ్ముఖమున నీ యాత్మచరితమును ప్రకటించితివో, ఎవ్వాఁడు నీతో సనుభావాపన్నుఁడై యశ్రుపాత మొనరించెనో, మెవనిని లోకులు ఆచార్య ఫాన్సిసు అని పిలుతురో, ఆతఁడే నీథియోడోసియసు.

“కన్సెన్సియా! పరమేశ్వరుఁడు మనయిద్దఱియాధ్యాత్మికకళ్యాణ సాధనార్థమై యీవిధముగ సంఘటింపఁ జేసె. మనమే యొకవేళ వివా హితులమై యుండి సంసారసుఖముల ననుభవించు చుండినచో, మనము నేఁ డనుభవించు నీస్వర్గీయవిమలానందము ననుభవింపఁ గలుగుదుమా? దరిద్రులకు సాహాయ్యమును, రోగులకు సేవయును, పాపాక్రాంతజనుల కుద్ధారసాధనములగు నీమహాత్కార్యము మన మూలమున నిర్వహింపఁ బడుటకు వీ లుండెడిదా?

“నీ వీయసార మగు విషయసుఖలాలసత్వమును బరిత్యజించి యీ మహావ్రతము నవలంబించినందున కై నేను పరమానందభరితుఁడ నైతి. మఱియు మన మిరువురమును నొక్కయాశ్రమమున నుండియే ప్రభు వగు పరమేశ్వరుని సేవ చేయునట్టి యవకాశము గలుగుట మన యధిక తరసౌభాగ్యమే యని చెప్ప నొప్పు. మన కిద్దఱికిని గల యాధ్యాత్మిక సంబంధ మెన్నటికిని నశింపఁజాలదు. ఇది మొదలుకొని మన మిరువు రము నొక్కటిగఁ గూడి భగవానునికార్యములందు నియుక్తుల మగు దుము. కాని నీవు థియోడోసియసు ఇహలోకమునకు మృతప్రాయుఁ డనియే తలంపవలయు. ఆచార్యుఁ డగు ఫాన్సిసు ఎల్లప్పుడు నీమంగళ సాధనమునకై నియతుఁడై యుండును.”

కస్టనన్సియా యాలేఖయందలివ్రాతసొబగును కనిపెట్టి యా యక్షరములు తనప్రియతమునివే యని తెలిసికొనెను. అపుడు పూర్వ దినమున వినినకంఠస్వరమును గూర్చియు కొంత యాలోచించి యా సుమధురవాక్యములు తనకు క్రొత్తవి గావని గ్రహించెను. ఆమె నేత్రద్వయమునుండి యానందాశ్రువులు రాల, హృదయ మొక యభూతపూర్వమగు భావరసముచే నుచ్ఛ్వసిత మయి, ఆమె కరపుటము లను జేర్చి యీశ్వరుని ప్రార్థింప సాగెను.

ఫ్రాన్సిసును, కస్టన్సియాయును నామఠమునందే పరస్పరము వేఱువేఱుగా నుండి ప్రబలోత్సాహముతో నీశ్వరుని నారాధించుచు, నాతనిగుణగానము సల్పుచు, ధర్మప్రచారమును జేయుచుండిరి. వా రిరు వురియొక్కయు సాంసారికజీవనము వినష్ట మయ్యెను. కాని వా రధ్యా త్మికజీవనలాభమును బొందిన వారై యతిపవిత్రభావమున నా పుణ్య క్షేత్రమునందే కాలమును గడపుచుండిరి.

వా రిరువురికిని వృద్ధాప్యము సమీపింప, నాప్రాంతములయం దమిత మగు జ్వరపీడచే జనులు మృతు లగుచుండిరి. వీ రిరువురికిని గూడ భీషణమగు సాంక్రామికజ్వరము తగిలినది. ఆచార్యుఁ డగు ఫ్రాన్సిసునికాల మాసన్న మైనటుల చిహ్నములు కాన్పింప సాగెను. ఈసమాచారమును విని కస్టన్సియా రోగపీడితయై యుండియు, తన శయ్యాగృహమునుండియే “నాకు లేచుటకైన శక్తి లేకున్నది. వారిని వెళ్లి నాకన్నులతో నొకపర్యాయము చూడవలయు నన్నను వలనుపడ కున్నది.” యనుచు నటుతరువాత “ఆచార్యఫ్రాన్సిసునికి నాప్రీతిపూ ర్ణములగు నమస్కారములను దెలిపి వారిమృత్యుకాలమున నా కొఱ కీశ్వరుని బ్రార్థింపవలసినట్లు నేను వేఁడితి” నని యొకమనుష్యునిమూల మ్మునఁ జెప్పి పంపెను. మన కత్యంతప్రేమాస్పదు లగువారిని మన

మీాశ్వరానుగ్రహమునకుఁ బాత్రులనుగాఁ జేయుట కంటె మనము వారికి జేయఁగల మహోపకార మేది గలదు? కావుననే యాచార్యుఁడగు ఫ్రాన్సిసు ఆమెవేఁడికోలు నంగీకరించి తనయాశీర్వాదములను బంపెను. చుట్టు నిలువఁబడి యుండువారందఱును జూచుచుండఁగనే ఫ్రాన్సిసునియొక్క ప్రాణసూర్యుఁ డీయిహలోకమునం దస్తమించెను. ఆమహనీయుఁడు దేవునియాజ్ఞలను దనజీవితమునందు బ్రతిపాలించుటచే ప్రశాంతభావముతో నీశ్వరునిపాదారవిందములకడఁ జేరెను. ఆచార్యుని మరణానంతరము కన్స్టన్సియాకును గాలము సమీపించినటుల లక్షణములు కన్పట్టెను. మృత్యుకాలము సమీపించుట నెఱిఁగి కన్స్టన్సియా మిక్కిలి యానందముతో "ఆయన యింతకుముందే యెచ్చటి కేగెనో, నేను గూడ నచ్చటికే పోవుచున్నాను. ప్రభు వగు పరమేశ్వరుఁడు మాయిరువురను నాలింగనము చేసికొనుటకై తనచేతులను జాచుచుండుటను నాదివ్యచక్షువులచేఁ జూచుచున్నదాన. మే మొక్కపర్యాయముగనే స్వర్గీయపితయొక్క సన్నిధానమునఁ జేరెద" మనెను.

సమీపమున నున్నవారితో "మిమ్ముల నే ప్రార్థించున దే మన నేను చనిపోయిన తరువాత నామృతకళేబరమును ఆచార్యఫ్రాన్సిసుని పార్శ్వమున సమాధి చేయవలయు ననియే" యనెను. శీఘ్రముగనే కన్స్టన్సియాయును నమరధామమున కేగెను. మఠాధివాసులందఱును మొదటినుండియు నీయపూర్వసోదరీసోదరులను భక్తిపూర్వముగ నాదరించుచుండెడివారు కావున వారిరువురు నేకకాలమున మృతు లగుటచే వారియందు శ్రద్ధాభక్తు లినుమడింప, మిక్కిలి సమారోహముతో నీ యధ్యాత్మికదంపతులను దగ్గఱగా నుంచి సమాధి జేసిరి. మఱియు నా స్థలమున నొకస్తంభమును నాటి దానిపై నీక్రిందిరీతిని నర్థ మిచ్చు నటుల స్వర్ణాక్షరములతోఁ జెక్కించిరి.

“ ఈపవిత్రస్థానమున ఆచార్యుఁ డగు ఫ్రాన్సిను, సోదరి కన్స్టన్సియాయును సమాహితు లయిరి. వా రీయిహజీవనమున స్వర్గీయప్రణయసూత్రముచే నధ్యాత్మికభావమున సమ్మిళితు లై రి. ఈసుఖకర పవిత్రప్రీతిమీళనము మృత్యువున కనంతరము ననంతకాల మవ్యాహతమై యుండుఁగాక!

ఓం తత్సత్.

సర్వేషా మపిదానానాం విద్యాదాన మనుత్తమం

# ఆంధ్రగీర్వాణాంగ్లవిద్యాశాల

| | | |
|---|---|---|
| గోదావరీతీరము ఆంధ్రదేశమునకు మధ్యస్థానము | 1912సంవత్సరమున స్థాపన యయినది | కొవ్వూరు రాజమహేంద్రవరమునకు శాఖానగరము |

ఇందు గురుకులవిద్యాలయమువలెనే విద్యార్థులకు అన్నసదుపాయము కలుగజేసి గురుకులవాసమున ఆంధ్రము, సంస్కృతము, ఆంగ్లేయవిద్య నేర్పుదురు. దొరతనమువా రేర్పరచినసంస్కృతవిద్యాశాలలపథకము ననుసరించి యీవిద్యాలయపథక మేర్పరుపబడినది. సంస్కృతము ప్రధానవిద్య. ఆంధ్రమును ఆంగ్లేయభాషయు ఉపవిద్యలు. ఇందు సాహిత్యమునందు పూర్ణప్రజ్ఞ కలుగునంతకు ప్రారంభించినది మొదలు పదిసంవత్సరములు పట్టును. వ్యాకరణమునందును తర్కమునందును మంచిప్రవేశము కలుగును. ఆంధ్రమునందు మంచిసాహిత్యము కుదురును. ఉభయభాషలయందును గద్యపద్యరచన కూడ పట్టువడును. రాజభాషయు బహువ్యాప్తమైనదియు నగు ఆంగ్లేయవిద్య కూడ నిందు బోధింపబడును. దేశభాషనుండి ఆంగ్లేయభాషకును, ఆంగ్లేయభాషనుండి దేశభాషకును అనువాదము చేయుటకు సమర్థత కలుగును. ఇందు చదివినవారికి ఆంగ్లేయభాషలో గలగ్రంథములు ధారాళముగ నర్థము చేసికొనుటకు.తగినసామర్థ్యము పట్టువడును. అనుదినవ్యవహారమునకు వలయువ్రాత, చదువు, గణితము మున్నగునవి దేశభాషయందు నేర్పుదురు. ప్రకృతిశాస్త్రపాఠములు దేశభాషయందు నేర్పబడును. వ్యాయామ

విద్య కూడ ననుదినమును ఆంగ్లేయవిద్యాశాలలయందువలెనే అభ్యాసము చేయించబడును. విద్వాన్‌పరీక్షకు చదువుకొనువారు ఈవిద్యాశాలయందు చదువుకొనినచో వేరుశిక్ష నందకయే పరీక్షకు బోవచ్చును. శిరోమణిపరీక్షకు చదువుకొనువారికి తగినశిక్షయు నిందు కలదు.

ఇప్పుడు 25 గురు విద్యార్థు లున్నారు. భోజనవసతి కూడ కలుగజేయబడుచుండుటచేత ప్రస్తుతోపపత్తి ననుసరించి విద్యార్థులసంఖ్య 20 వరకు నియతము చేయబడినది; కాన వారిసంఖ్య అంతమాత్రము గనే యున్నది. 20మంది విద్యార్థులు ఇందు తావు దొరకక వెడలిపోవలసినవారైరి. దొరతనమువారు పరీక్షించి సహాయము చేయవలసిన విద్యాశాలలపట్టికలో దీనిని కూడ చేర్చిరి. ప్రస్తుతము గ్రామస్థులందరును దీనియం దభిమాన ముంచి విద్యార్థులకు భోజనసదుపాయము కలుగజేయుచున్నారు. రాజమండ్రికాపురస్థులును కీర్తిశేషులు నైన నూలు వెంకటరత్నముగారు వ్రాసినవ్రయలుప్రకారము స్థాపన మయి యూపురమున నెలకొల్పబడిన సత్రమునందు కొందరువిద్యార్థులకు అన్నసదుపాయము కలుగుచున్నది. భోజనసదుపాయమునకు అధికవసతియేదైనయొకటి కలిగినయనంతరము ఎక్కువవిద్యార్థులను చేర్చుకొందురు.

దీనికి ప్రధానోపాధ్యాయులుగ నియమింపబడినవారికి ఆంధ్రము, గీర్వాణము, ఆంగ్లేయవిద్య, హిందీ యనునాలుగుభాషలయందు ప్రావీణ్యము కలదు. ఆంగ్లేయవిద్యాశాలయందు బోధనాపద్ధతుల నారితేరినట్టు వీరికి సర్టిఫికెట్టు కలదు. ఈయన యిచ్చటనే యిదివరకు లోవరు సెకండరీస్కూలు స్థాపన చేసి తొమ్మిదిసంవత్సరములు స్వతంత్రముగ ...సంస్కృతవిద్యాశాలయం దధ్యాపకులుగా

నున్నారు. ఈవిద్యాశాలయందు పని చేయునిమిత్తమయి వీరి కనుమతి యొసంగి యేలూరుతాలూకాబోర్డుప్రెసిడెంటుగారు వీరియధ్యాపకత్వ మీవిద్యాశాలకు లభింపజేసిరి. సాహిత్యమునందు ప్రవీణత గల మరియొకరు సహాధ్యాపకులుగా నున్నారు. మహాభాష్యవేత్తలును వైయాకరణశిరోమణులు నగు పుసులూరి రామశాస్త్రిలవారును, వారి సోదరులును తర్కశాస్త్రవిశారదులు నగు సుబ్రహ్మణ్యశాస్త్రిలవారును తమయభిమానశాస్త్రములయందు వలయుశిక్షల నొసంగుచు విద్యాశాలా నిర్వహణమునకై వేతనముల నభిలషింపకయే దీనియందు పని చేయుచున్నారు.

ఇప్పు డెం దైదుతరగతు లున్నవి. ఉన్నతపాఠశాలయం దొక తరగతి మాత్రమే యున్నది. తక్కిననాలుగుతరగతులును ప్రథమశిక్ష. పై తరగతులలో చేరువిద్యార్థులు లేమిచే ఆయాతరగతుల కింకను ప్రసక్తి కలుగలేదు. విద్యార్థులు చేరినతరుణముననే ఆయాతరగతులు పెట్ట బడును.

దీనికి శాఖగ పూళ్ళగ్రామమున ప్రథమశిక్ష (ఎలిమెంటరీ) యొసగుపాఠశాల యొకటి స్థాపింపబడినది. దానికి ద్రోణంరాజు వెంకటా చలపతిగారి సహధర్మచారిణి యగు లచ్చమాంబగారు కొంతస్థిరవసతి నొసంగిరి. వెంకటాచలపతిశర్మగారి విద్యావ్యాసంగ మీప్రాంతములవారి కెరుంగని వారు లేరు. వారియొద్ద నున్నంత సంస్కృతాంగ్లేయాంధ్రకోశసామగ్రి యేదైన విద్యాశాలలయం దున్న నుండు నేమో కాని మరియెచ్చటను లే దని చెప్పవచ్చును. ఇప్పుడు వారివద్ద దాదాపు అయిదారువేలరూ పాయలవిలువ గల గ్రంథము లున్నవి. ఇందు గలగ్రంథములు విశే

మించి సంస్కృతభాషలోనివి. ఈకోశసామగ్రి యంతయును ఈవిద్యా
శాలకు చెందచేయుటకు వారు వుయలు వ్రాయ సంకల్పించియున్నవారు.
ఈవిద్యాశాలాసంఘమునందు శర్మగారు కూడ నొకసభ్యులు. ఉన్నత
విద్యాశిక్షయే యిందు ప్రధానముగ జేయ నీవిద్యాశాలాస్థాపకులసంక
ల్పము. శాఖావిద్యాలయములు పెక్కులు బయలుదేరిన గాని ఆసంక
ల్పము సంపూర్ణముగ నెరవేరనేరదు.

## —* నిర్వాహకుని విజ్ఞాపన *—

"సర్వారంభాస్తండులప్రస్థమూలాః" ధనము లేనిది యేకార్య
మును జరుగనేరదు. భోజనవసతికిని అధ్యాపకభృతికిని తదితరవ్యయము
లకును దీనికి విశేషముగ ధనము కావలసియున్నది. ఇంతవరకు ధనోపార్జ
నమునకై తగినప్రయత్నము లేమియును జరుగలేదు. ఇప్పుడు దీనికి సాలుకు
రు 100 లు వచ్చుస్థిరవసతి మాత్రము నావలన నొసంగఁబడినది. ఇది
స్థాపన యయినసంవత్సరమునుండియును దీనివెచ్చ మంతయును నేనే
భరించుచున్నాడను. నేను విశేషద్రవ్యవంతుడను కాను. నాస్నేహి
తులు ఈవిద్యాశాలయందు చూపుచున్నయభిమానముచేతను, విద్యా
ర్థులకు వారు భోజనసదుపాయము కలుగజేయుటచేతను, వలయునపుడు
వారు కూడ దీనిరక్షణభారమును వహింతు మని వాగ్దానము చేసియుం
డుటచేతను, ఆఫలాకాంక్షను చూచుకొని నే నింతవరకు దీనిని సంరక్షిం
చుకొనుచువచ్చితిని. ఈవిద్యాశాలయం దన్నితరగతులును పూర్ణముగ
పని చేయునపుడు అధ్యాపకభృతికే అధమము నెలకు రు 250 లగును.
అది గాక భోజనవసతికి తగినసదుపాయము కలుగవలెను. ఈవిద్యవలన
[illegible] కలుగ నుండినను ఇప్పటివరకు నీపండితులు పొందు

చున్న ఉపాధిరాహిత్యముచే సామాన్యముగ తమవెచ్చమును తాము భరించుచు పిల్లల నిందు చదివించువార లుండుట యరిది. అందుమూలమున భోజనసదుపాయము కూడ కొంతకాలమువరకు కలుగజేసిన గాని యీవిద్యావ్యాసంగము వృద్ధిలోనికి రాదు. ఈవిద్యాశాలయందు పూర్ణశిక్ష నొందినవారలకు స్కూలుఫైనలుపరీక్షయందు జయము నొందెడు వారికి గలుగులాభము లన్నియును కలుగగల వనియును, అందులకై దొరతనమువారియుత్తరువులు కూడ కొలదిదినములలో పుట్టగల వనియును విద్యాశాఖవారివలన తెలియవచ్చుచున్నది. భోజనవసతికై కూడ ధనసాహాయ్యము విశేషముగ కావలయును. ఇట్టికార్యము మహారాజులవంటివారు పూనిన గాని ఒకపట్టున కానికార్యము.

“తితీర్షు ర్దుస్తరం మోహా దుడుపే నాస్మి సాగరం” అనువచనము రఘువంశకర్తయందు సార్థకము నొంద లేదు గాని అది నాయందన్వర్థ మని మాత్రము నిశ్చయముగ జెప్పగలను. నావంటివాఁ డ ఘనకార్యమును సాధింప బూనుట చీమకాశీయాత్ర యని నే నెఱుంగుదును. అయినను హృదయమున నాటికొనిన దేశాభిమానబీజ మొకటి నిరంతరమును నన్ను వేధించుచుండ ఊరకొనలేక “దేశో విశాలః బహవో వదాన్యాః” అని యనుకొని దేశాభిమానమానసీయు లిందు నాకు తోడ్పడక యుందురా యనుదృఢనిశ్చయముతో దీని కుపక్రమించితిని. ఉపక్రమించినది మొదలు ఈయది నిరంతరాయముగా జరుగుచు దినదినాభివృద్ధి నొందుచున్నది. ఎవ్వరితోడ బ్రశంసించినను హెచ్చరికవాక్యములే గాని నిరుత్సాహవాక్యములు రాలేదు. నే ననుకొనిన దానికంటె నిందు చదువుకొనవలెనను విద్యార్థులయభిలాష హెచ్చుగ

గనబడుచున్నది. నాతోడ కూడ నుండి దీనికి సహాయభూతు లయి విద్యావిషయమున పని చేయువారిస్వార్థపరిత్యాగమును ధర్మైకదీక్షయును నా కుత్సాహజనకములుగ నున్నవి. విజయదశమినాటితో నొక వత్సరము నిండినది. కొలదిదినములలో వత్సరోత్సవము జరుగును. ఇంతదనుక దీనికార్యభార మంతయును నాయొక్కనిదే యయినను ప్రముఖులును విద్యాభిమానులు నగునాస్నేహితులయుపదేశమును గొనుచు కార్యమును నిర్వహించుచుంటిని.

దేశాభిమానమాననీయులును, విద్యాభిమానులును, ఉదారశీలురును అగు అస్మద్దేశీయు లందరును తమశక్తి వంచన లేకుండ స్వహస్త పరహస్తముల దీనికి తగినధనసాహాయ్య మొసంగి ఈవిద్యానిలయాంకురము వృక్షమై శాఖోపశాఖల విస్తరిల్లి దేశము నలుతట్టుల వ్యాపించి దేశీయు లందరు తచ్ఛాయయందు సురక్షితులై వర్థిల్లున ట్లనుగ్రహింతురని నమ్ముచు వారియుదారభావమునకు నీవిజ్ఞాపన మొనర్చుచున్నాడను.

కో వ్రూ రు. }
10—10—13. }

ఇట్లు విధేయుడు,
తల్లాప్రగడ సూర్యనారాయణరావు.

# మానవసేవాగ్రంథమాల.

## రాజమహేంద్రవరము.



1. కబీరు—ఇందు చరిత్రాంశము వచనముగను, ఉపదేశములు పద్యములుగ నుండును.
అత్తిలి సూర్యనారాయణగారిచే రచియింపఁబడినది. 0-2-0

బంగాళాదుఃప—నిడదవోలు వేంకటరావుగారి విరచితము. 0-2-0

అగ్గిపెట్టెలయంత్రశాల—కందుల శ్రీమన్నారాయణగారి విరచితము. 0-4-0

లోకపావనశతకము—ఇందలిపద్యములు భక్తిరసము నొలికించును.
ఆకిపూడి సోమనాథరావుగారిచే రచియింపఁబడినది. 0-2-0

5. కోటిలింగశతకము—ఇందలిపద్యములు నీతిని, దేశభక్తిని పురికొల్పును.
సత్యవోలు అప్పారావుగారిచే రచియింపఁబడినది. 0-3-0

6. స్త్రీలయెడ మనము గావించు పంచమహాపాతకములు—
నాళము కృష్ణారావుగారిచే రచింపఁబడినది. 0 1-0

7. వీరమతి—వీరరసప్రధానమైననాటకము. ఇందు దేశాభిమానము, స్వార్థత్యాగము, స్త్రీసాహసము ప్రదర్శింపఁబడును.
మంగిపూడి వేంకటశర్మగారిచే రచియింపఁబడినది. 0-10-0

8. భారతీయసందేశము—స్వదేశాభిమానమును, విదేశయాత్రవలనఁ గలుగు ప్రయోజనములను వెల్లడించు నొకభాణము. 0-1-0

9. భక్తితరంగిణి—ఇందు భగవద్భక్తి, దేశభక్తి, మానవసేవ మున్నగువాని గూర్చిన పద్యములు గలవు. 0-2 0

10. దేవేంద్రనాధచరిత్రము—అత్తిలి సూర్యనారాయణగారి విరచితము. 0-2-0

11. అనాథాభ్యుదయము—వితంతువులదురవస్థలును, వారివలన దేశమునకుఁ గలుగుమహోపకారములును దెలుపు భాణము. 0-2-0

12. క్రొవ్వువత్తులు చేయువిధము— 0-1-0

13. బాబా గురునానకు చరిత్రము—ఇ. సుబ్బకృష్ణయ్యగారి విరచితము. 0-1-0

14. ఆనందశతకము—ఇందలిప్రతిపద్యము భక్తిరసాస్పదమై యుండును.
నూరాబత్తుల సూర్యనారాయణగారిచే రచింపబడినది. 0-2-0

15. ఉత్తమవివాహము—వివాహభేదములు, ధర్మములు, విధులు దెలుపును.
పాలపర్తి నరసింహముగారిచే రచింపఁబడినది. 0-1-0

16 పున్నాబాయి—వీరరసప్రధానమైననవల. రాజకుమారునిఁ గాపాడుటకు నిజకుమారుని శాత్రవునికత్తి కెరచేసిన యొక రాజపుత్రిసాధ్వీమణి చరిత్రము. ఇందలి రాజనీతి, గూఢచారుల చతురోపాయములును చదివితీరవలెను.

సత్యవోలు అప్పారావుగారిచే రచింపఁబడినది. 0—8—0

17. హేలావతి—చరిత్రాత్మకమైననవల. ఒకమాలస్త్రీ హుమాయూను చక్రవర్తియొక్క మంత్రికుమారుని వరించి పెండ్లియాడినకథ.

తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారిచే రచింపఁబడినది. 0—4—0

18. ప్రభావతి—ప్రభావతీప్రద్యుమ్నమునకు సరియైనవచనము. పింగళి సూరనార్యుఁడే దీనిని వచనమున వ్రాసినట్లుండును.

సూరాబత్తుల సూర్యనారాయణగారిచే రచింపఁబడినది. 0—4—0

19. మీరాబాయి—భక్తిరసప్రధానమైన పద్యకావ్యము. తనపతిచే నింద మోపబడి ప్రాణముల త్యజించిన శ్రీకృష్ణభక్తురాలిచరిత్రము. ఇందలి పద్దెములు ముక్కుతిమ్మనార్యునిపద్దెములవలె ముద్దులొలుకుచుండును.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిచే రచింపఁబడినది. 0—4—0

20. కురుపాండవదాయభాగవిమర్శనము—ఇయ్యది శ్రీకాశీభట్ల బ్రహ్మయ్య గారి కురుపాండవదాయభాగవినిర్ణయము పై వ్రాసినవిమర్శనము.

కవిరాజు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచింపఁబడినది. 0—1—6

21. బ్రాహ్మమతము—ఇందు దేవుఁడు, మానవుఁడు, ప్రకృతి, ఉపాసన, పాపము—మోక్షము, అవతారములు—మధ్యవర్తులు, ప్రమాణ గ్రంథము—ఈశ్వరప్రత్యాదేశము, సాంఘికాదర్శము మున్నగు విషయములు యుక్తియుక్తముగఁ జర్చింపబడినవి.

పాలపర్తి నరసింహముగారిచే రచింపఁబడినది. 0—6—0

22. ఆర్యసూక్తిముక్తావళి (ప్రథమభాగము)—ఇందు భారతమునందలి నీతులు, రాజధర్మములు తెలుపుపద్యములు ఏర్చి కూర్చఁబడినవి.

సత్యవోలు అప్పారావుగారిచే రచింపఁబడినది. 0—4—0

23. కర్ణభారము—ఇయ్యది కాళిదాసునకుఁ బ్రాచీనుఁడగు భాసమహాకవిచే రచింపఁబడిననాటకమునకుఁ దెనుఁగు.

మానవల్లి రామకృష్ణకవి ఎమ్. ఏ. గారిచే ననువదింపఁబడినది. 0—2—0